మధుమంజరి ప్రచురణ : 6

# తేజోవలయాలు

(ఋషుల - మహాభక్తుల చరిత్రలు)



This book is Published with the Financial Assistance of Tirumala Tirupathi Devasthanams under Their Scheme - Aid to Publish Religious Books.

డా. పోచిరాజు శేషగిరిరావు

TEJOVALAYAALU
(Biographical Essays on Saints, Sages & Devotees)

By
Dr. Pochiraju Seshagiri Rao

First Edition : March 1995
Copies : 1000





Printed at
Sri Maruti Printers
Ashok Nagar, Kakinada - 533 003

Cover Page designed and Printed at
Prasanthi Offset Printers,
Ramaraopeta,
Kakinada - 4.




For Copies
Dr. Pochiraju Seshagiri Rao
House No. 1-4-19/6
Plot No. II, Street, No. 7
Habsiguda - Hyderabad - 500 007.

పుటలు

# డా॥ పోచిరాజు శేషగిరిరావుగారి రచనలు

| | | | |
|---|---|---|---|
| 1. | మధుమంజరి | (వ్యాస సంపుటి) | 1969 |
| 2. | ఆనందవల్లి | (ఖండ కావ్యము) | 1981 |
| 3. | ముక్తాలత | (గేయ కవితా సంపుటి) | 1984 |
| 4. | కాదంబిని | (సాహిత్య వ్యాసాలు) | 1985 |
| 5. | వేటూరివారి సారస్వత పరివస్య | (పరిశోధన గ్రంథం) | 1986 |
| 6. | వేటూరివారి జీవితం-సాహిత్యం (తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ) | | 1988 |
| 7. | శారదా మంజీరాలు | (సాహితీ మూర్తుల జీవన రేఖలు) | 1992 |
| 8. | తేజోవలయాలు | (ఋషుల - భక్తుల చరిత్రలు) | 1995 |

## అముద్రిత రచనలు

| | | |
|---|---|---|
| 1. | శరత్స్వర్ణ | (గేయ కవితా సంపుటి) |
| 2. | కుమారారామము- ఇతర కవితలు | (కవితా సంపుటి) |
| 3. | ద్రోణ పుష్పము | (ఖండ కావ్యము) |
| 4. | నవాలోకము | (ఖండ కావ్యము) |
| 5. | పరిన ముత్యాలు | (పద్య సంపుటి) |

# మనవి మాట

'తేజోవలయాలు' నేను ప్రకటించిన వ్యాససంపుటాల్లో నాలుగవది. ఇందులో ఋషుల, మహాభక్తుల చరిత్రలు సంధానించబడ్డాయి. ఎప్పుడో నలభై యేళ్ళ క్రిందట టి. ఏ. వేంకటేశ్వర దీక్షితర్‌గారు వెలువరించిన వ్యాసాలు చదివిన స్ఫూర్తితో ఋషుల చరిత్రలు కూర్చినాను. (శ్రీ) దీక్షితర్ పూర్వ మీమాంసలో దక్షిణ భారతానికి మకుటం అనదగినవారు. తిరుపతి సంస్కృత కళాశాలలో వారు మాకు ప్రిన్సిపాలు (1940-42). ఉద్దండ పండితులు. నైష్ఠిక జీవనులు. అనర్గళంగా ఆంగ్లంలోంచి సంస్కృతంలోకి, సంస్కృతం నుండి ఆంగ్లంలోకి తర్జుమా చేయడం వారికి కూసు విద్య. అంతే కాదు. రెండు భాషల్లో సరళ సుందరంగా ఉపన్యసించ గల దిట్టలు సనాతన భారతీయ సంస్కృతి ఆయనకు ఊపిరి. జీవితాన్ని అందుకే మీదు కట్టిన పుణ్యశ్లోకులు.

ఈ సంపుటంలోని వ్యాసాలు కొన్ని 'ధర్మ సింధు' మాస పత్రికలో వెలువడ్డాయి. ఆ పత్రిక (1972-82) పెద్దాపురం (తూ॥ గో॥ జిల్లా) నుండి ప్రచురింపబడేది. ఆ పత్రిక ప్రేరణ వల్లనే ఇవి వ్రాయటం జరిగింది. ఆ పత్రిక నిర్వహణ బాధ్యత కూడా కొంత నా పైన ఉండటం మరోకారణం.

'రమాసౌందర్యమంజరి' అజ్ఞాత కవి రచన. దీనిని 1943 లో మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక శాలలోని వ్రాత ప్రతినుండి 'కాపీ' చేసిపెట్టుకొన్నాను. దాన్ని పరిష్కరించి ఈ సంపుటంలో జత పరచినాను.

ఉత్తమ సంస్కారవంతుల చరిత్రలు జాతికి దారి దివ్వెలు.

పడతాయని నమ్మేవాళ్ళల్లో ఒకణ్ణి. ఏ కొందరికైనా ఈ గ్రంథం ఉప కరిస్తే ధన్యుణ్ణి.

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యానికి కృతజ్ఞుణ్ణి. అత్యంత శ్రద్ధతీసికొని అందంగా అచ్చువేసిన శ్రీ మారుతీ ప్రింటర్స్ అధినేత చి॥ వి. వి. కృష్ణారావును హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

శ్రీ రామచంద్రప్రభు సేవనంలో ఉంటూ రామాయణ ప్రవచనమే ఊపిరిగా భాగవత మార్గంలో నడుస్తున్న విద్వాంసులు శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారు ఆశీః పురస్సరంగా అందించిన అభిప్రాయానికి సదా కృతజ్ఞుణ్ణి.

ఆత్మీయులు, సాహిత్య కళా నిష్ణాతులు డా॥ ముదిగొండ వీరభద్రయ్యగారు (కేంద్రవిశ్వవిద్యాలయము, హైదరాబాదు) పీఠికను సవదరించి పెట్టినారు. వారికి పరమేశ్వరుడు సకల విభూతులు కలిగించాలని దైవాన్ని ప్రార్థిస్తూ సెలవు తీసికొంటాను.

— పోచిరాజు శేషగిరిరావు

20-2-95

# నమోవాకం

పూజ్యులైన మహావిద్వాంసులు, బ్రహ్మీభూతులైన శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారికి సాహిత్య, ఆధ్యాత్మిక విద్యలందు శిష్యులునూ అయిన డా॥ పోచిరాజు శేషగిరిరావు గారు రచించిన 'తేజోవలయాలు' అన్న గ్రంథం చెడిపోయిన ఈ కాలంలో రావడం తెలుగు ప్రజల అదృష్టమని చెప్పాలి. 'స్వయంతీర్ణః పరాన్ తారయతి,' గుర్వనుగ్రహంచేత స్థితప్రజ్ఞులూ, మహాభక్తులూ అయిన మహానుభావులు శేషగిరిరావుగారు. వారి నడక, వారి వాక్కూ ఇతరులపై ప్రభావం వేయ గలిగిన శక్తి కలిగినవి.

ఈ 'తేజోవలయాలు' గ్రంథంలో సగానికి పైగా ఉన్నది ఏకనాథుని చరిత్రమే. మహా విద్వాంసుడైన భక్తుడు ఏకనాథుడు. విద్వద్భక్తులైన శేషగిరిరావు గారు ఆ మహాభక్తుని గురించి రాయడం ఎంతో సమంజసం. యాజ్ఞవల్క్య మహర్షి భృగు, అగస్త్య మహర్షులని గురించీ, శ్రీపాదరాజులు, మురారి బాపులను గురించీ కూడా శేషగిరిరావుగారు చక్కని వ్యాసాలీ గ్రంథంలో వ్రాసారు. ఇట్లా సనాతనులైన యాజ్ఞవల్క్యాదుల నుంచి ఇటీవలి మురారి బాపు వరకున్న మహాభక్తులను గురించి రాయడంలో ఎంతో నైపుణ్యం చూపారు శేషగిరిరావుగారు. అగస్త్య మహర్షిని గురించి రాస్తున్నపుడు చారిత్రిక దృష్టిని కూడా ఎంతో ఉచిత రీతిలో శేషగిరిరావుగారు చూపి చాలా సమాచారాన్ని జిజ్ఞాసువుల కిచ్చారు. ఇవి కాకుండా మతము మనశ్శాంతి అన్న చివరి వ్యాసం ఈ గ్రంథంలో ఎంతో ప్రయోజనాత్మకంగా ఉన్నది. ప్రజానీకం యొక్క ఆనందారోగ్యాలకు మూలకందం మతమేనంటూ మతానికీ, విజ్ఞానానికీ పొత్తు కుదరదనుకోవడం తప్పనీ శ్రీ శేషగిరిరావుగారీ వ్యాసంలో తేల్చారు. పోగా మానసిక ప్రశాంతి సంపాదనకు మతం ఒక్కటే మిక్కిలిగా ఉపయోగిస్తుందని రచయిత ఏ దాపరికమూ లేకుండా చక్కగా తమ అభిప్రాయాన్ని ఈ వ్యాసంలో తెలిపారు.

డా॥ శేషగిరిరావుగారెంతటి పరిశోధక విమర్శకులో అంతటి కవి వర్యులు కూడా. ఆ కారణంగా ఈ గ్రంథం చివరలో పేరు తప్ప ఏ వివరాలూ తెలియని 'రామయ్య' అన్న పేరుతో ఉన్న 26 చక్కని రసగుళికల లాంటి పద్యాలను ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నుంచి సంపాదించి ప్రచురించారు ! ఇది

ర్తి లాభం పొందని ఒక చక్కని కవికి శేషగిరిరావుగారి ఉదార హృదయం చేసిన సాహిత్యసేవ !

ఈ మొత్తం వ్యాసాల్లోని ఏక సూత్రత భక్తి. దీన్ని మహాభక్తుల చరిత్రమని కూడా అనవచ్చును. ఏకనాథుడు, మురారి బాపు చరిత్రంలోని హరి జనుల విషయికంగా వారి ప్రేమను శేషగిరిరావుగారు ఎంతో ప్రభావవంతంగా రచించి పుణ్యం కట్టుకున్నారు. ముఖ్యంగా ఏకనాథుని కథలో హరిజనులను ఆయన ఆదరించి బ్రాహ్మణ్యం చేత నిందితుడయి కూడా, భగవదనుగ్రహంవల్ల గొప్ప లీల ఒకటి జరుగగా, నిందకులకు బుద్ధి వచ్చిన ఘట్టాలను డా॥ శేషగిరిరావుగా రెంతో రమణీయంగా రాశారు. ఇలాంటి రచనను చదివాక ప్రభావితుడుకాని పాఠకు డుండడు. అంతేకాకుండా మన ప్రాచీనుల మీద గౌరవము పెరగని పాఠకుడు కూడా ఉండడు. భక్తి - మానవత్వమూ రెండూ ఒక్కటే నన్నది ఇలాంటి రచనల్లో పాఠకులకు కలిగే స్పృహ. "స తరతి స తరతి లోకాం స్తార యతి" అంటున్న నారద భక్తి సూత్రం ఏకనాథులకు పూర్తిగా అన్వయ మవు తుందన్న తెలివిడిని కల్గించారు శేషగిరిరావుగారు.

ఇప్పుడు శరీరాలతో లేని మహా భక్తుల, ఋషుల చరిత్ర ఉన్న ఈ గ్రంథాన్ని చదువుతూంటే వారంతా మన ముందుకి వచ్చి ప్రత్యక్షమైనారా ! అని అనిపిస్తుంది. ఈ పుస్తకం చదువుతున్నంతసేపూ వారితో సాంగత్యంతో ఉన్నట్లుగా ఉంటున్నది. "మహత్సంగస్తు దుర్లభోఽ గమ్యోఽమోఘశ్చ" అన్న భక్తి సూత్రాన్ని కాదంటూ మహాత్ముల సంగాన్ని ఈ పుస్తకం సులభం చేస్తున్నదంటే అతిశయోక్తి కాదు. ముముక్షుత్వాన్ని ప్రసాదించే భగవంతుణ్ణి మన దగ్గరకు చేర్చేవాడు భక్తుడు. భగవ దనుగ్రహం ఎంత శక్తివంతమో, మహాత్ములైన భక్తుల కృప కూడా అంతే శక్తి వంతం లాభదాయకం. "ముఖ్యతస్తు మహత్కృపయైవ భగవత్కృపాలేశాత్ వా" అన్నదొక నారదీయ భక్తి సూత్రం. ఈ గ్రంథం మహాత్ముల కృప మన మీద ప్రస రించేట్టుగా చేయగలిగేటట్లు రాశారు పోచిరాజు శేషగిరిరావుగారు. ఇదెంతో పుణ్యకా ర్యమని చెప్పనక్కరలేదు "స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే" అని ఆచార్య శంకరులు వివేక చూడామణిలో అన్నారు. నిస్సంగత్వం లేనిదే ఇది సాధ్యం కాదు. నిస్సంగత్వం సత్సంగత్వంవల్ల కలుగుతుంది. 'దుస్సంగః సర్వథైవ త్యాజ్యః

అని భక్తి సూత్రం. స్వస్వరూపానుసంధానానికి ఇలాంటి మహా భక్తుల చరితలు మనకు ఆదర్శాన్నిస్తాయి. నిరంతర ఈశ్వర స్మరణలో ఇలాంటి మహా భక్తుల చరిత్రలు చదవడం కూడా ఒక భాగమే.

"అనన్య చేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః"

అని గీతలో భగవంతు డన్నాడు కదా! భక్త చరిత్రం మనల్ని ఈశ్వర ధ్యానం లోనే, స్మరణలోనే నిల్పుతుంది,

ఎంతో ఆకర్షణీయమైన శైలితో భాషతో ఈ పుస్తకాన్ని రచించి పూజ్యులు శ్రీ శేషగిరిరావుగా రెంతటి భగవత్సేవ చేశారో ఊహించలేము. 'భక్తి హీనేన యత్కించిత్ కృతం సర్వమసత్సమమ్' అన్నారు పెద్దలు. ఇంతటి మహా కార్యాన్ని ఎంతో భక్తితో చేసిన శేషగిరిరావుగారి ఈ కృషి ఎంత సత్కార్యమో !

పదవీ విరమణ చేసిన తర్వాత కూడా ఇట్లా నిరంతర వాగ్దేవీ సేవ చేస్తున్న డా॥ పోచిరాజు శేషగిరిరావుగారిని ఆ భగవతి చల్లగా కలకాలం చూడాలని ప్రార్థిస్తూ వారిని మనసారా అభినందిస్తూ వారికీ వారి సహవృతైన మహాయోగులు వేటూరి ప్రభాకరులకూ నమస్కరిస్తూ

9-1-1996

ముదిగొండ వీరభద్రయ్య
(తెలుగు శాఖ - హైదరాబాద్ కేంద్ర
విశ్వ విద్యాలయము)

# భక్త్యావిష్కరణం

భారతదేశం భక్తికి నిలయం. భక్తికి బీజం జ్ఞానం. విత్తు లేనిదే మొక్క పుట్టదు. పూవు లేనిదే వాసన రాదు. విత్తువంటిది పూవు వంటిది జ్ఞానం. మొక్క వంటిది, వాసనవంటిది భక్తి. వాసన లేని పూవువంటిది భక్తిలేని శుష్క జ్ఞానం. అటువంటి జ్ఞానాన్ని ఒకనాడు స్థూలతుషావఘాతమని - ఊకదంపు అని బ్రహ్మ గారు వాపోయినారు. క్లేశమే తప్ప ఫల ముండదు. కొందరికి జ్ఞానము శ్రమపడి సంపాదించవలసి ఉంటుంది. కొందరికి భగవదనుగ్రహం చేత సహజంగా కలిగి, దాని వికాసమైన భక్తి బాహ్యంగా ప్రకాశించును వారికి సాధనదశ అంటూ ఉండదు. ఫలదశయే కన్పట్టును. అట్టి వారు సిద్ధపురుషులు, మహాయోగులు, వారికి ఆడంబరము లుండవు. ఖ్యాతి, లాభ, పూజలపై మోజుండదు. తాము పొందిన అనుభవాన్ని లోకానికి తెలియకుండా అందిస్తుంటారు, అట్టి మహా పురుషులలో ఒకరు (శ్రీ) వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మహా యోగులు, సిద్ధపురుషులు. వారి శిష్యులలో ఒకరు (శ్రీ) పోచిరాజు శేషగిరిరావుగారు. వీరు నిరాడంబరంగా తా మనుభవించిన దాన్ని ప్రబంధరూపంగా లోకాని కందించిన మహనీయులు.

వారు 'తేజోవలయాలు' అను పేరుతో ఒక గ్రంథాన్ని మన కందించారు. ఆ గ్రంథంలో భక్తులగు జ్ఞానుల చరిత్రలు ఆవిష్క రించారు. మన ఋషులలో ప్రసిద్ధులైన యాజ్ఞవల్క్యమహర్షి, భృగుమహర్షి, అగస్త్యమహర్షి అను ముగ్గురు మహర్షుల చరిత్రములను తేజోవలయాలలో దర్శించి ప్రకాశింప జేసినారు. భగవానుడు తేజ

చున్న ఒక్కొక్క భాగము ఒక్కొక్క భక్తుడుగా, జ్ఞానిగా, దర్శన మొసంగు చుండును. వారి చరిత్రలు లోకసామాన్యం కావు. అతి లోకములు. వానిని అవగాహన మొనర్చుకొని ఆవిష్కరించుటకు ఎంతో పరిశ్రమింపవలెను. వారి చరిత్రలు లోకానికి ఆదర్శములు, ఆదరణీయములు, ఆచరణీయములు. వాని నెరుంగుటచే మన మనసుల లోని దుష్టసంస్కారములు మాసిపోయి నూతనమగు సాత్విక భావన విలసిల్లును. సంస్కారమే మానవుని ముందుకు నడిపించును. వాసనలను, సంస్కారములను పవిత్రముగా చేసుకొనుటకు ప్రాచీన ఋషుల చరిత్రములను, భక్తుల చరిత్రములను ఎల్లప్పుడు చదివి, భావించి అనుభవించవలెను. దాని చేతనే ఆత్మశాంతి కలుగును.

మహాభక్తులు మన దేశములో మహారాష్ట్ర దేశములోను, ద్రావిడ దేశములోను, కర్ణాటక దేశములోను ఆవిర్భవించినారు. వారి చరిత్రలే భారతసంస్కృతీ వికాసచరిత్రము. దాని కొఱకై శ్రీ శేషగిరిరావుగారు కొందరు మహాభక్తుల చరిత్రములను, ఋషుల చరిత్రములను ఇందు పొందు పరచినారు. మహాభక్తులలో అగ్రగణ్యుడు ఏకనాథుడు. మహారాష్ట్ర దేశమున ఆవిర్భవించినవాడు. అతని చరిత్రము సకలలోక సంసేవ్యము. ఎన్నో ఆశ్చర్యకరములగు సంఘటనలు వారి చరిత్రలో కన్పట్టును. ప్రదర్శనమునకై చేయవలెనని వారు చేసినవి కావు. వారికి తెలియకయే జరిగినవి. భగవత్ప్రేమ నిండి, భగవదనుభవములో నిండినవారి హృదయములలో భగవానుడే వెలసి ఉండి వారి మహత్త్వమును లోకమునకు ప్రకాశింప జేయుచుండును. అట్టి మహాపురుషులలో దివ్యత్వము ప్రకాశించుచుండగా దర్శించినవారు ధన్యులు. అట్టి మరాఠీ భక్తుడగు ఏకనాథుని చరిత్ర మిందు ప్రధానముగా విపులముగా వివరింప బడినది అట్లే కన్నడ సాహిత్యములో హరిదాసుల కీర్తనలు ప్రసిద్ధి నందినవి. అట్టి హరిదాసులలో శ్రీ శ్రీపాదరాజరు

ప్రసిద్ధులు. వారి భక్తి గీతములు లోకమును పావన మొనర్చునవి. సౌరాష్ట్ర దేశము మన కందించిన భక్త శేఖరుడు మురారి బాపు. ఆయన చిన్ననాటనే రామచరితమానసను అత్యంత ప్రీతితో విని ఆనందించి తన్మయతనందినారు. వీరు శ్రవణ భక్తులు. మురారి బాపు మీరా కృష్ణదర్శనం చేయుటకు చూపిన ప్రీతికంటె, శబరి రామ దర్శనమునకై పడిన ఆరాటము కంటె ఎక్కువ తపన చెందినవాడు. ఇట్టి మహనీయులను దర్శించి లేదా చరిత్రములను విని మనసున శాంతి నెలకొల్పుకొనుటయే మానవ జీవిత గమ్యము. శరీరానికీ, మనసుకు ఆరోగ్యాన్ని, శాంతిని ప్రసాదించేది మన ప్రాచీన సంప్రదాయముపై విశ్వాసము కలిగి దానిని ఎరింగి ఆనందించుటయే. అట్టి విశ్వాసము మతపరార్థ్య మగునేమోయని కొందరు భ్రమించుచుందురు. దానిని తొలగించుటకై మతము - మనశ్శాంతి పేరుతో ఇందొక వ్యాసము కలదు. చివర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున మదరాసులో లభించిన 'రమా సౌందర్యమంజరి' అనెడి కృతినికూడ దీని చివర చేర్చినారు. లక్ష్మీస్వరూపమున ఇరువదియారు పద్యములు గల ఈ కృతి పరమ రమణీయము.

శ్రీమాన్ పోచిరాజు శేషగిరిరావుగారు మన మనసునకు ప్రశాంతిని, ఉత్తమ సంస్కారమును అందించ గల కొందరు మహా పురుషుల, మహా భక్తుల చరిత్రములను ఇందు నిబంధించి ఆంధ్ర పాఠకలోకమునకు అందించినారు. వీరు కీర్తిని, ధనాన్ని, గౌరవాన్ని పొందాలనే ఆరాటము లేనివారు. నిరాడంబరులు, అంతర్ముఖులు. శ్రీహరి చరణారవింద సంసేవనమే తన లక్ష్యమని గుర్తించి ప్రాచీన సాహిత్యాన్ని తరచి అందలి మేలిరత్నాలను లోకానికి అందిస్తూంటారు అట్టి వారి రచనలలో తేజోవలయాలు విశిష్టమైనవి. ఆంధ్రభక్త పాఠకలోకము దీనిని అనుభవించి ఆనందించునట్లు శ్రీ సీతారామ

చంద్రులు అనుగ్రహింతురు గాక ! శ్రీ శేషగిరిరావుగారు ఆయు రారోగ్య భాగ్యములను పొంది ఇతోధికముగ ఆంధ్రభాషలో వారు చేయుగలిగిన సేవలను చేయునట్లు పరమకారుణికుడగు శ్రీరామచంద్ర ప్రభువు అనుగ్రహించునుగాక.

ఎ - 61
షీలా నగర్,
విశాఖపట్టణం - 12

ఇట్లు
**శ్రీభాష్యం అప్పలాచార్యులు**

# ఏకనాథుడు

మహారాష్ట్రంలో భక్తశిఖామణి ఏకనాథుని నెఱుగని వారెవ్వరూ లేరు. ఆయన సాధుపుంగవుడు. లోకంలో ఇట్టి యోగపుంగవు లరుదుగానే ఉంటారు. ఆ మహనీయుడు స్వయం శిక్షితుడైన గృహస్థేగాక, ఉత్తమ కవీ, భక్తుడూను. భక్తి మార్గమున మోక్షమును సాధించిన మహాభాగుడు. శ్రీకృష్ణుని బోలిన అవతారము లెన్నో లోకమున గలవు. ఏకనాథుడు శమదమాది సంపత్తుల ద్వారా దైవప్రేమల ద్వారా ఎన్నింటినో సాధించిన మహానుభావుడు. తానేర్ప రచుకొన్న జీవన విధానమును వీసమెత్తుకూడ అతిక్రమించని నియమవర్తుడు. అట్లయ్యును, ఆర్తితో నున్న వాడెవ్వడేని ఏదేని వస్తువు నడిగిన, ఆ మరుక్షణమునం దావస్తువు నొసంగ గల ఉదారశీలి.

ప్రాచీన నగరం ప్రతిష్ఠానంలో క్రీ.శ. 1555లో ఏకనాథుడు మహారాష్ట్రమున పుట్టినాడు. ఈయన జగత్ ప్రసిద్ధుడైన సాధుపుంగవులలో నొకడగు భానుదాసునకు మునిమనుమడు, చక్రపాణికి మనుమడు. తల్లిదండ్రులు రుక్మిణీబాయి, సూర్యనారాయణులు. రుక్మిణీబాయి మహాభక్తురాలు. వారి ఏకైక సంతానమే ఏకనాథుడు. అదే తల్లిదండ్రు లాతనికుంచిన ముద్దు పేరు.

ఏకనాథుడు బాల్యంలోనే తల్లిదండ్రులను గోల్పోయినాడు. అందుచేతనే ఆతని పెరుగుదల అంతా తాతగారింటిలోనే. ఏకనాథునకు ఆరవయేట విధివిహితంగా ఉపనయనం చేశారు. ఉపవాసాది నియమాలను పాటించుటేకాక, నియమ పురస్సరంగా వేదాధ్యయనం చేసినాడు. ఆతని చిన్నతనంలో ప్రతిరోజూ వారింట ఒక వృద్ధ బ్రాహ్మణుడు పురాణ ప్రవచనం చేస్తూండేవాడు. బాలుడయ్యు ఏకనాథుడు దానిని శ్రద్ధతో వినేవాడు. ఆ పౌరాణికుడు ఏకనాథుని ప్రతిభను గుర్తించినాడు.

ఏకనాథుడు పన్నెండేండ్లకే భాగవత పఠనమును పూర్తిచేసినాడుగాని, ఒక మహాగురువును దర్శింపవలె నని ఎంతగానో తపించి పోవుచుండెడి వాడు. ఎవరో ఒక ఆధ్యాత్మిక గురువు తనకు లభించిననేగాని ఆత్మ దర్శనము కాదని గాఢముగా విశ్వసించినాడు. అట్టి గురువెవరు? ఒక వేళ దొరికితే ఏ నియమాలు పాటించాలి?

ఇట్లుండగా ఒకరోజున ఏకనాథుడు నిరాశా నిస్పృహాలు తన్నల ముకొన్న వేళ, శివాలయం లోనికి శైవాన్ని ధ్యానించుటకై పోయి ధ్యానమగ్నుడైనాడు. ఆ ధ్యాన సమయంలోనే అతనికి గర్భగుడి నుండి ఒక శబ్దమిట్లు వినవచ్చెను 'నీవు దేవగిరికి వెళ్లు. అక్కడ జనార్దన పంత్ అనే మహాజ్ఞాని ఉన్నాడు. ఆయన నీకు దివ్యోద్బోధము చేయగ లడు. ఈ మాటలు విని మృత్యుగహ్వరం నుంచి బయటపడిన వాడెంత గా సంతోషించునో ఏకనాథుడంత గా మహానందభరితుడైనాడు. ఆ సంఘటన నొకరోజున పౌరాణికునకు నివేదించినాడు. అటు పిమ్మట ఎవరితోను చెప్పకుండా ఒకరోజున ఏకనాథుడు ఒంటరిగా భగవన్నా మం జపించుకొంటూ కొన్ని మజిలీలు దాటి దేవగిరి కోటను సమీ పించినాడు.

ఆ కోటను జనార్దనస్వామి సంరక్షిస్తుంటాడు. ఆయన మంచి సమర్థుడు, స్వతంత్రుడు, సూక్ష్మగ్రాహి, గరీయః ప్రతిభుడు. యోగ శాస్త్రమును పూర్ణంగా అవగాహించిన ధన్యజీవి. దత్తాత్రేయభక్తుడు. ఆ మహాపురుషుడు మానవాకృతి ధరించియు నిత్యమూ పరమాత్మ దర్శ నానుభూతిని పొందేవాడు. ఆ దివ్య దర్శనం జరిగే ప్రదేశము కోట కెంతో దూరంలో నుండేది. ఆ పవిత్ర స్థలంలో జనార్దన పంత్ చాల సేపు సమాధి నిష్ఠుడై యుండేవాడు.

ఏకనాథుడు యాత్ర చేసుకొంటూ క్రమంగా అక్కడకు చేరు సరికి జనార్దన స్వామి పూజామందిరంలో ఉన్నాడు. ఆ తేజః పుంజ

మునుచూచి చూడగానే ఏకనాథుడు నిస్సంకోచంగా సాష్టాంగ దండ ప్రణామములాచరించి, గురుచరణార విందములను [illegible]. ఈ పాదములే శ్రీ పాదములు. నన్ను ఆశీర్వదింప దగినవి. భవసాగరము నుండి దాటింపగలవి. నిజానికి ఇవే నా జననీ జనకుల పాదములు అని సంభాషించుచు ఒక మహానందానుభూతి పొందసాగెను

కొంత సేపటికి జనార్ధనస్వామి తన చరణముల చెంత మోకరిల్లి పడియున్న బాలునిచూచి ఎంతో ప్రీతితో లేవనెత్తినాడు. ఆ బాలుని పవిత్ర నేత్రాలలో స్పందించుచున్న స్థిర నిశ్చయమును, భక్తిని ప్రసన్నతను, ఓర్మిని, హృదయ నైర్మల్యమును గురుపు వీక్షించి నాడు. ఆ దృక్ప్రసారము ఏకనాథుని శాంత చిత్తుణ్ణి చేసింది వారిద్దరూ ఇలా మాట్లాడుకొన్నారు.

స్వామి : అబ్బాయీ ! ఎక్కణ్ణుండి నీ రాక ?
ఏకనాథుడు : స్వామీ! ప్రతిష్ఠానపురం నుండి.
స్వామి : అంత దూరాన్నుంచి నడచి రావటానికి కారణం ?
ఏకనాథుడు : తమదర్శనార్థం స్వామీ! మీ సేవ చేస్తూ ఇక్కడనే ఉండిపోవాలని.

స్వామి : నన్ను సేవించటం మూలాన నీవు పొందే లాభం ?
ఏకనాథుడు : మీ చరణ సమాశ్రయణంలో నాకు పరిపూర్ణ విశ్వాసం ఉంది. మీ దివ్య కటాక్షాన్ని పొందాలని, దైవాన్ని సందర్శించాలని నా అభిలాష.
స్వామి: నీకు ముందూ వెనుకా ఎవరున్నారు?నీ రాకనుగూర్చి వారికి తెలుసా ?
ఏకనాథుడు : అయ్యా ! నాకు తాత, బామ్మ ఉన్నారు. అయితే వాళ్ళిద్దరూ నన్ను వెళ్ళనీయరేమోనని వారితో చెప్ప లేదు స్వామీ !

ఇట్లు కొంతసేపు సంభాషణ నడిచింది. పిమ్మట జనార్ధన పంత్ తన వెంట ఏకనాథుని గొనిపోయి, శిష్యతానుగ్రహం ప్రసాదించి చిన్నతనమునందే యింతటి పరిత్యాగబుద్ధి ఏర్పడినందులకు ఆతడెంతో ఆనందించినాడు. ఏకనాథుడుకూడా తన గురువును సాక్షాత్ దైవముగా నెంచి మహావిశ్వాసంతో, అనన్య భక్తితో సేవలు చేసికో సాగినాడు. గురువుకై ప్రతిదినము నీళ్ళు తోడి తేవటం, పూజాపుష్పములు సేకరించటం, గురువు పూజ చేస్తున్నంతసేపు ఆ పూజామందిర ద్వారం దగ్గర నిలుచుండటం, పూజానంతరం స్వామికి భోజనాదికము వడ్డించటం, నిదురించేముందు గురు పాదములు క్షాళన మొనర్చటం ఇట్లా ఎన్నో పరిచర్యలు భక్తితో ఏకనాథుడు సాగించినాడు. ఏకనాథుడు రెండేండ్లపాటు ఈ విధంగా గురుశుశ్రూష చేసినాడు. ఈ రెండేండ్లు ఒక్క క్షణముకూడ తన ఇంటివిషయము తలచలేదు.

ప్రతి గురువారము ఒక ఏకాంత స్థలమునకు పోయి, జనార్ధన స్వామి ఉపవసించి ధ్యాన సమాధిలో నిమగ్నుడయ్యేవాడు. అది గమనించిన మహమ్మదీయ పాలకుడు, ఆతనియందున్న గౌరవాన్ని పురస్కరించుకొని ఆరోజు సెలవు దినంగా ప్రకటించటం జరిగింది. కాని ఒకసారి గురువారమునాడు దేవగిరి దుర్గద్వారమును హఠాత్తుగా వైరిమూక ముంచివేసినది. ఆ సమయంలో జనార్ధనస్వామి తపస్సమాధిలో నున్నాడు. ఏకనాథుడు గుమ్మం దగ్గిర కాపలా కాస్తు న్నాడు. వైరి సేనావాహినివల్ల ఉత్పన్నమైన అల్లకల్లోల పరిస్థితిని గమనించి ఏకనాథుడు ఒక నిర్ణయానికి వచ్చి, గురువుగారు తమ ఆయుధసామాగ్రిని, కవచమును దాచియుంచిన చోటికి చటుక్కున పోయి గురువుగారి యుద్ధాశ్వముపై దూకి రెప్పపాటులో ప్రజలమధ్యకు వచ్చి జనబాహుళ్యంలో విశ్వాసమును పూరించినాడు. తోడనే ఏకనాథుడు దుర్గము వెలుపలకు వచ్చి శత్రు మధ్యమున సింహామువలె గర్జిస్తూ ప్రవేశించి, శత్రు సేనావారమును నిర్మూలించెను. చిత్రమే

మంటె, ఇంతిసేపూ గురువు మామూలుగా తపస్సమాధిలోనే యున్నాడు. ఏకనాథుడు జనతలో శాంతిని క్రమశిక్షణను స్థాపించి, తిరిగివచ్చి ఆయుధములను, కవచములను యథాపూర్వ స్థానమున నుంచి తానును నిశ్చింతగా గురువున్న మందిర ద్వారం దగ్గర నిశ్చలముగా శిలవలె నిల్చినాడు. ఎట్టి యుద్రేకమునకు లోనుగాక, తన శిష్యుడు ఏకనాథుడు దేవగిరి కోటను సంరక్షించినందుకు జనార్దనస్వామి యెంతయో ఆనందించినాడు. శిష్యుని ప్రశాంత మనస్కత, సమయ స్ఫూర్తి, ఉత్సాహము, ధైర్యము, వినమ్రతల కెంతయో జనార్దన పంత్ ఆనందభరితుడైనాడు.

ఇంకొక రోజున జనార్దనస్వామి తన జమాఖర్చులను సరి చూడవలసినదిగా శిష్యునకు పురమాయించెను. ఏకనాథుడు ఆదాయ వ్యయములు వ్రాసి యున్న పుస్తకములను పరిశీలింపగా ఒక పైసా తేడా వచ్చెను. ఆ తేడా బుజువు చూచుకొనుటకై రాత్రి అంతయు పరిశ్రమించి తుదకా తప్పును కనుగొని ఆనందముతో తాండవించి పోయినాడు. ఎందుకింత

కొని, ఒక మందహాసము చిందించి

మాట్లాడుచు సంసార మందలి తప

పింపవలయుననియు, తన్మాత్రలమున

దనియు ఏకనాథుని హెచ్చరించినాడు.

ఆ మరునాడే శుక్రవారము రోజున జనార్దనస్వామి, దేవగిరి కుత్తరముగా నున్న పర్వతశ్రేణులలోని ఒక ఏకాంత ప్రదేశమునకు శిష్యుని తనవెంట గొంపోయి వానితో "ఎవ్వరూ ఇక్కడకు రాజాలరు. ఒక్క దత్తాత్రేయులు మాత్రమే రాగలరు. వారు తమ కిష్టము వచ్చిన రూపమున ఇట కవతరింపగలరు" అనెను. కొన్ని గంటలు గడచిన తర్వాత రోతగొల్పు వేషముతో ఒక బిచ్చగాడు రాళ్ళనడుమ జీబుగా నల్లుకొన్న పొదల మాటున ఒక ఆడకుక్కతో

కానవచ్చెను. వానిని చూడగానే జనార్ధనస్వామి పరుగెత్తెను. ఇరువురు గాఢాలింగనము చేసికొన్నారు. కొంత సేపేదో పిచ్చాపాటీ చెప్పుకొన్న పిమ్మట ఆ బిచ్చగాడు స్వామికొక పాత్ర నిచ్చినాడు. అతడా పాత్రలో ఆడకుక్క పాలను పితికి తీసికొని వచ్చినాడు. బిచ్చకుడు, స్వామి ఆ కుక్కపాలలో రొట్టెలను ముంచుకొని ఎంతో ఆప్యాయతతో తినసాగినారు. ఏకనాథుడు సంఘటనమును కన్నులార చూచియు నమ్మలేక పోయెను. అంతలో బిచ్చగాడు ఏకనాథుని పిల్చి, తన చెంతనున్న పాత్రను ఆ దగ్గరలోనే పారుతున్న సెలయేటి నీటిలో కడుగుకొని తీసికొని రమ్మన్నాడు. అప్పు డేకనాథు డా భిక్షాపాత్రను తీసికొనిపోయి, ఆ వాగునీటిలో పరిశుభ్రంగా కడుగుచు, బహుశః ఆ యాచకుడే తన గురువు చెప్పిన దత్తాత్రేయుడు కాడుగదా అని తలపోసి, ఆపాత్రలో కొద్దిగా నీటిని తీసికొని తానును త్రావెను. ఆ మరుక్షణమే దత్తాత్రేయుడు ఏకనాథునకు ప్రత్యక్షమయినాడు. అంతకు ముందున్న కుక్క కామధేనువు రూపము వహించెను. ఆ దివ్య పురుషు డేకనాథు నాశీర్వదించి గాఢాలింగన మొనరించెను. ఆ దివ్యపురుషుడు జనార్ధనస్వామిని ఇంతటి మహోత్తర శిష్యుని పడసినందులకు అభినందించెను. ఇకముందు ఏకనాథు డెల్లవేలమందినో రక్షింపగలడని కూడ చెప్పెను.

గురువుయొక్క ఆదేశము మేరకు ఏకనాథుడు కొండ శిఖరముపై కొన్ని యేండ్లు శ్రీకృష్ణభగవానుని గూర్చి తపస్సు చేసినాడు. ఒకరోజున గోపాలకు డొకడు ఏకనాథుని నిశ్చల తపోదీక్షకు మురిసి, తనంత తానే ప్రతిదిన మాతనికి పాలనొసంగ సాగినాడు ఇట్లుండ నొకదినమున రోజూవచ్చే గొల్లపిల్లవాడు అనుకోకుండా ముందుగానే వచ్చుసరికి ఏకనాథుడు నిశ్చల సమాధిలో నిమగ్నుడై యుండెను. అప్పుడు ఏకనాథుని శిరస్సుపై పడగ విప్పి ఒక మహాసర్పము గొడుగు పట్టినట్లు పట్టెను. గోపబాలకు డది చూచి బిత్తరపోయి కేకలు

వేయసాగెను. అంతలో ఏకనాథుడు సమాధి స్థితినుండి మేల్కాంచెను. ఆ మహానాగ మెవ్వరిపై బుసలు కొట్టకుండ నెమ్మదిగా ఎటకో జారి పోయెను. జనార్దనస్వామి ఇది గ్రహించి ఏకనాథుని తన ఇంటికి పిలిపించి వానితో నిట్లన్నాడు. "ఆధ్యాత్మిక సాధనలో తెలిసికొనవలసినదంతా నీవు సాధించినావు. ఇప్పు డిక నాతో కలసి తీర్థయాత్రలు చేయుటకు సిద్ధముగా ఉండు."

తరువాత గురుశిష్యు లిరువురు ఎన్నో తీర్థయాత్రలు చేస్తూ ఒకనాడు గోదావరీనదీతీరమున నున్న 'చంద్రబోధ' పండితుని కలసికొన్నారు. ఆ మహా విద్వాంసుడు జనార్దనపంత్, ఏకనాథులను తన యింటి కతిథులనుగా గొనిపోయినాడు. ఆయన భాగవతములోని నాలుగవ స్కంధమును పఠించుచు మహత్తరానుభూతితో కన్నీరు కార్చుచుండెను. ఆ సన్నివేశమును గురుశిష్యు లిరువురు ప్రత్యక్షముగా కనుగొనిరి. జనార్దనస్వామి ఏకనాథునితో "ఈ వ్యాస మహాభాగవతమును సంస్కృతము నుండి దేశ భాషయైన మరాఠీ భాషలోనికి నీ వనువదించుట నా అభిమతము. అట్లు చేసినచో జనసామాన్య మెంతగానో మేలు పొందగలదు" అనెను. ఏకనాథు డప్పుడే సంస్కృత భాగవతమును పరమ సాహితీ సుందరముగా మరాఠీ భాషలోనికనువదింప సాగినాడు. చంద్రబోధ పండితు డెంతగానో ఆనందించి, మరోమాట చెప్ప లేక పోయినాడు. ఆ చంద్రబోధ పండితుని తమ వెంట తీసికొని వారిరువురు నాసిక్, పంచవటి, త్ర్యంబకేశ్వరములను సందర్శించినారు.

జనార్దనస్వామి ఏకనాథు నట వదలి, ఆ బ్రాహ్మణునితో మిగిలిన తీర్థక్షేత్రములు సేవించుకొనుచు స్వస్థానము దేవగిరి చేరుకొనెను.

ఈలోగా ఏకనాథుని తాత, బామ్మ మనుమనికై విలపించి

ఆయన ఆ వృద్ధ దంపతుల దయనీయ స్థితిని జూచి ఏకనాథుని వెదకు
టకై పాపమా వృద్ధ పౌరాణికుడు బయలుదేరినాడు. చిన్నప్పుడు
ఏకనాథుడు తనకు వివరించిన స్వప్నవాతనికి జ్ఞప్తికి వచ్చినది.
తోడనే దేవగిరి వైపునకు పయనమై జనార్దనస్వామిని కనుగొనెను.
ఏకనాథుడు తొందరలో ప్రతిష్ఠానపురమునకు రాగలడని స్వామి
యిచ్చిన లేఖను గైకొని పౌరాణికు డింటికి వచ్చి వృద్ధ దంపతుల
నూరడించెను.

ఏకనాథుడు పవిత్ర నదీజలాలలో స్నానమాడి, భవ్య భారత
వర్షములలోని దేవాలయములను, బదరీనాథము వరకు గలవానిని
చూచి, చిట్టచివరకు ప్రతిష్ఠానపురమున నున్న శివాలయమునకు
జేరుకొన్నాడు. ఆ సమయంలోనే ఆతడు సన్న్యసించవలె ననుకొని
తన గురువు జనార్ధనపంత్ నిర్ణయమునకే ఆ విషయమును వదలివేసి
ఆ దేవాలయమున్న త్రోవ ప్రక్కనే నిరీక్షిస్తూ నిలబడినాడు.
దైవమే దారి చూపగలడని ఆతని పరిపూర్ణ విశ్వాసము. ఏలాగుననో
ఈ వార్త ఏకనాథుని తాత చెవిని పడినది. వెంటనే ఆ శతవృద్ధుడు
ఏకనాథు డున్న చోటికి వచ్చి మనుమని గట్టిగా కౌగలించుకొని
ఎంతోసేపు కన్నీరు కార్చి ఆతనితో ఇట్లన్నాడు "ఏమోయి !
ఏకనాథ ! ఇన్నేళ్ళు నుండి నీ వెక్కడున్నట్లు ? నీ కోసం మే మెంతో
తాపత్రయపడి దేశాలన్నీ వెదకినాము ! మే మంటే ఎందుకు నీకంత
కోపం ! ఇక నీవు ఊరు విడిచి వెళ్ళటానికి మేము ఏ మాత్రం సమ్మ
తించం !" వెన్వెంటనే తాత ఏకనాథుని చేతిలో జనార్దనపంత్
యిచ్చిన ఉత్తరాన్ని పెట్టినాడు. ఏకనాథున కంతా బోధపడింది.
ఇదే కాబోలు గురు దేవుల నిర్ణయం అని, తాతగారు తన చేతిలో
నుంచిన లేఖను నెత్తిమీద పెట్టుకొని, ఆ ప్రదేశంలోనే చిన్న పూరి

ఒక చిన్న యిల్లు ఏర్పడింది.

అటు పిమ్మట శ్రీకృష్ణ జన్మదినమున గోకులాష్టమినాడు పూజలు చేయాలని నిర్ణయించుకొన్నాడు. ఆ రోజు ఎంతో ఆనందోత్సాహాలతో పరమాద్భుతంగా నామ సంకీర్తనం చేయసాగినాడు. ఆ దిన మంతా భగవంతుని దివ్యనామ సంకీర్తనంలో ఏకనాథుడు మునిగి తేలినాడు.

అటు తర్వాత కొన్నాళ్ళకు, దేవగిరినుండి జనార్దనస్వామి, ఏకనాథు డున్న తావున కేతెంచి, ఆతనిని చూచి శ్రీ దత్తాత్రేయ స్వామివారే అక్కడ నున్నట్లుగా తలంచి ఇంటిలోనికి ప్రవేశించినాడు. గురుదేవుడు జనార్దనస్వామి రాకను గమనించిన ఏకనాథుడు గురుచరణములపై బడి ప్రణమిల్లినాడు. అంతేకాదు. ఆయన చరణ ధూళిని తన శిరస్సుపై జల్లుకొన్నాడు. సాష్టాంగ దండ ప్రణామము లాచరించినాడు. ఆ సమయములోనే శ్రీకృష్ణుని జనన గాథను గురించి ఎంతో అందంగా హృదయం స్పందించేటట్లు ఏకనాథుడు పాడిన పాటలకు జనార్దనస్వామి ఎంతగానో మురిసిపోయినాడు. అట్లు మహా వైభవంగా కృష్ణ జన్మాష్టమి ఉత్సవాలు ముగిసిన పిమ్మట, ఏకనాథుని తాత, ఆతని అర్ధాంగి జనార్దనస్వామి పాదములపై బడి ఇట్లు వేడుకొన్నారు "స్వామీ! మీ రాతనికి వెలుగుబాట చూపించినారు. ఇక ఇప్పుడు భానుదాసుని వంశం విచ్ఛిన్నం కాకుండా చూడవలసినదని మిమ్ములను మరీ మరీ వేడుకొంటున్నాము. ఈ ఏకనాథు డొక్కడే మా వంశంలో మిగిలినాడు. ఆతడు గృహస్థాశ్రమం స్వీకరించేటట్లు చూడవలసినదిగా మిమ్ము వేడుకొంటున్నాము."

గురువు జనార్దనస్వామి ఆ వృద్ధ దంపతుల అభ్యర్థనను అంగీక

రించి వెంటనే ఏకనాథుణ్ణి పిలిచి 'నీవు గృహస్థాశ్రమంలో స్థిరపడు. అట్లు చేస్తేనే నీవు సర్వ వస్తువులలోను విశ్వ వ్యాపకుని దర్శించ గలవు అప్పుడే నీ జీవిత సర్వస్వము కృష్ణున కంకిత మియ గలవాడ వగుదువు' అన్నాడు.

కొన్నాళ్ళకు విజయపురంలో ఒక చక్కని అమ్మాయిని చూచి ఏకనాథునకు పెండ్లి జరిపించారు పెద్దలు. ఆమె అన్ని విధాలా అతనికి తగిన అర్థాంగి. కష్టాలలో - సుఖాలలో ఆమె భర్త ఏకనాథునకు సహాయపడ సాగింది ఒక మహా భక్తునికి ఇల్లాలుగా ఉండదగిన మహనీయ లక్షణము లామెలో నిండుగా నెలకొన్నాయి. ఆ సతీమణి పేరే 'గిరిజాబాయి'.

గిరిజాబాయి ఒక దేవత వంటిది. ఏకనాథునికి గురువు ప్రసా దించిన అనుగ్రహ విశేషమే ఆమె అనిపించింది. ఏ పాటి ఆదుర్దాను ఆమె భర్తకు కలిపించేది కాదు. భర్త మనోభీష్టాన్ని ముందే గ్రహించి తాను వర్తించేది. అంతటి యోగ్యురాలు లోకంలో ఉండటం అరుదు.

ఏకనాథ దంపతులు నలువది యేండ్లపాటు ప్రతిష్ఠానపురంలో ఆదర్శ జీవనం సాగించారు. కాలక్రమంలో ఏకనాథుని తాతగారు, బామ్మ కీర్తి శేషులైనారు, ఏకనాథుడీ ప్రకృతి ధర్మమునకు కించిత్తు కూడ దుఃఖింపలేదు. ఆయన ఒక మహాయోగి, గొప్ప స్థితప్రజ్ఞుడు.

ఏకనాథుడు ఫాల్గుణ బహుళ షష్ఠినాడు - అది దత్తాత్రేయులు తనకు దివ్య దర్శన మొసంగిన రోజు - ఎంతో ఉత్సాహంతో ఉత్స వము జరిపినాడు. ఆ మహోత్సవము గోదావరీ తీర గ్రామాలలో గాలిలా వ్యాపించి పోయింది. ఏకనాథుని దివ్య భక్తి సంకీర్తనలు ఉరవడితో వచ్చే నీటి కెరటాల వలె, పాడే పాటలీ పుష్పాల వలె గుబాళించి పోయినాయి, ఆ సంకీర్తనం విన్నవారికి ఆనంద సముద్రం

ఉప్పొంగినట్లనిపించేది. ఆసంకీర్తన సంచయం దశదిశలందు వైభవమహి
మలను వ్యాపింపజేసినాయి. ఇట్లా సంకీర్తనలు- కథాగానాలు ముగిసిన
పిమ్మట ఆనాటి సాయంకాలం భక్తజనులందరకూ సమారాధనం
చేయవలసి యుండెను. అప్పుడు ఏకనాథుని సేవకుడు ఉద్ధవుడు ఒక
శ్రీమంతునికడ ఏడు వందలరూపాయలు ఋణముగా తన యజమాని
కొఱకు తెచ్చినాడు. సంతర్పణ మహా వైభవంగా పూర్తియైనది. కాని
చిత్ర మేమంటే, ఆ మరునాడే అప్పు తీర్చవలసిందిగా ఋణదాత ఉద్ధ
వుని ఒత్తిడి చేయసాగినాడు. ఆతడు సరేలే! చూద్దాం అన్నాడు.
ఆ శ్రీమంతుడు ఉద్ధవుని వాలకం చూచి, తనబాకీ వసూలు కాదని అను
మాన పడి, తిన్నగా ఏకనాథుని దగ్గరకే పోయి ఆతనిని భయపెట్టుటతో
ఊరుకోక, పాండురంగస్వామి సాక్షిగా తన అప్పు తీర్చేవరకూ
ఏకనాథుని భోజనము చేయనీయనని శఠించినాడు. ఏకనాథ దంపతులు ఈ
ధార్ష్ట్యానికి ఏమీ చలింపలేదు. ఒక్క మెతుకైనా వారు వాసన
చూడలేదు వారిలాగే వారి సేవకుడు ఉద్ధవుడుకూడా నిరాహారిగానే
ఉండిపోయినాడు.

అప్పుడు శ్రీకృష్ణుడే ఉద్ధవుని రూపమును వహించి ఆ ఋణ
దాత కడకు పోయినాడు అది అర్ధరాత్రి. యజమాని తనకు నిద్రా
భంగము జరిగినందుకు కొంత అసంతృప్తిపడి విసుగుకొంటూ ఎలాగో
నిద్రనుండి లేచినాడు. ఇట్లా వారి సంభాషణ సాగింది.

యజమాని : ఇంత అర్ధరాత్రి నీ వెందుకు వచ్చినట్లు ?

ఉద్ధవుడు : మీ బాకీ జమ కట్టడానికి.

యజమాని : రేపు ఉదయందాకా ఆగలేకపోయావా ?

ఉద్ధవుడు : మా యజమాని, ఆతని భార్య ఉపవాసం చేస్తు
న్నారు కదా! మరి వారి సంగతో ?

ధనాశా పీడితుడైన ఆ ఋణదాత తన కిష్టంలేకపోయినా లేచి విసుగుతోనే తన కొట్టు తలుపు తీసి ఖాతాపుస్తకం తీసి బాకీ జమ కట్టి ఏకనాథుని ఋణాన్నుండి విముక్తుణ్ణి చేసినాడు.

ఆ మరునాడే ఆ శ్రీమంతుడు ఏకనాథ దంపతులను బాధ పెట్టి నందులకు లోలో మథనపడుతూ, ఏకనాథుని కడకు వచ్చి ఆతని పాదములపై బడి 'స్వామీ! నన్ను రక్షించు' అని ప్రాధేయపడినాడు. కాని ఏకనాథు డెంతో వినయంగా తానే దోషినని, ఋణం తీర్చే వరకు ఉపవాసము చేయలేక భోజనం చేసినానని బదులు చెప్పినాడు. ఈ వృత్తాంతం విని ఆ శ్రీమంతుడాశ్చర్యపడి చెంతనే ఉన్న ఉద్ధవుని వైపు తిరిగి 'ఏమిటీ విచిత్రం! అర్థరాత్రి వేళ నీవే వచ్చి నన్ను లేపి బాకీ జమ కట్టినావుకదా!' అన్నాడు. ఉద్ధవుడా మాటలకు మరింత ఆశ్చర్యపడి 'మీరంటున్నది సరి కాదు.' అన్నాడు. వీసమెత్తైనా తొణకకుండా, ఏకనాథుడు తన పద్దు పుస్తకం తెరచి చూచేసరికి అందులో ఋణదాత ఇచ్చిన రశీదు భద్రంగా ఉంది. ఇదంతా శ్రీకృష్ణ భగవానుని దివ్యానుగ్రహం కాని మరియొకటి కాదు. ఆ క్షణంలో ఏకనాథుని నేత్రాలనుండి ఆనందబాష్పాలు అప్రయత్నంగా రాలినాయి అది చూచి ఋణదాత మరల ఏకనాథుని పాదాలపైబడి తనను క్షమింప వలసినదిగా ప్రాధేయపడినాడు. ఎంతో ఔదార్యంతో ఏకనాథు డాతన్ని క్షమించి, వానికి మనశ్శాంతి ప్రసాదించినాడు. ఏకనాథుడు దయా ప్రపూర్ణుడు. ఎప్పుడూ ఉద్రేకపడి ఎఱుగడు. ప్రశాంత మనస్కత ప్రిదిలిన ఘడియ ఒక్కటీ కానరాదు.

ఒక రోజున, భక్తశిఖామణి ఏనాథుడు గోదావరీనదిలో స్నానం చేసి వస్తూండగా, ఆ నది ఒడ్డునే కూర్చున్న తురక యొక డాతనిపై కాండ్రించి యుమిసినాడు. ఏమీ సమాధానము చెప్పలేదు సరికదా ఏకనాథుడు మళ్ళీ నదిలోకి దిగి, యథావిధిగా స్నానంచేసి మామూలుగా

ఇంటికి వచ్చినాడు. ఇంటికడ శుభ్రమైన వస్త్రములు ధరించి ఏక నాథుడు వెలికిరాగా మరల ఆ మహమ్మదీయుడే అతనిపై నుమిసినాడు. అప్పటికీ ఏకనాథుడేమీ ఉద్రేక పడలేదు, కోపగించనూలేదు. తనపై ఆయన ఎన్నిమార్లు ఉమిసినా తొట్రుపడక, నిశ్చలంగా నదిలోనికి దిగి స్నానంచేస్తూ వచ్చినాడు. ఏకనాథుని ఓర్మికి, నిగ్రహమునకు ఆ మూర్ఖుడు విస్మయపడి తన తప్పు గ్రహించి, ఏకనాథుని క్షమాభిక్ష వేడుకొన్నాడు. అప్పుడేకనాథుడా మార్గమున వచ్చుట తనదే తప్పనీ, ఇందులో క్షమింప వలసిందేమీ లేదని చెప్పినాడు. ఆ మహమ్మదీయుడు ఏకనాథుని వినమ్రత కెంతగానో ప్రభావితుడై పశ్చాత్తాపమొంది స్వామి పాదములపై బడి 'అయ్యా! నేను మహాపాపాత్ముణ్ణి నన్ను క్షమించి, ఆశీర్వదించండి అన్నాడు. 'కాదు కాదు నీవుచేసిన తప్పేమీ లేదు. నీ కారణంగా, నేను పుణ్య గోదావరీనదిలో నూట ఎనిమిది మార్లు స్నానం చేసినాను. నీ చర్య నాకు మంచినే కలిగించింది' అన్నాడు ఏకనాథుడు. ఆ మ్లేచ్ఛుడు ఏకనాథస్వామి కాళ్ళపై బడి పశ్చాత్తప్తుడై తనకు దివ్యోపదేశము చేయవలసినదిగా ప్రార్థించి నాడు. "చాలా బాగుంది అయితే విను. దైవ మొక్కడే అల్లా అను, మరో పేరుతో పిల్చుకో! భగవంతుడు సర్వాంతర్యామి. ఎవ్వ రినీ బాధించకు. సర్వ మానవాళిలోనూ దైవాన్ని సందర్శించు" అని ఏకనాథు డాయన కుపదేశించెను.

ఎవరైనా ప్రసిద్ధి పొందుతుంటే ప్రజలు అసూయ పడటం లోకసైజము. అందులోనూ పండితులలో, ఈ తీవ్రమైన అహంకారమూ గర్వమూ తమ పాండిత్యం కారణంగా చోటు చేసుకొంటాయి. తపస్విగా - మహాపురుషుడుగా - భాగవతోత్తముడుగా ఏకనాథుడు పడసిన కీర్తి ప్రతిష్ఠలు పండితు లెందరకో అసూయా జనక మైంది. ఏమాత్రం చిన్న అవకాశం దొరికినా, ఏకనాథుని ఇబ్బందులకు గురి

ఆశ్రయించిన చేటునే దగ్గర చేస్తుంది.

ఇట్లుండగా ఒకనాడు అక్కడా అక్కడా బిచ్చమెత్తుకుంటూ తిరిగే పేద బాపడొకడు తన కుమారునికి వడుగు చేయాలనుకుని అందులకు రెండువందల రూపాయలవసరం వచ్చినాయి. ఈ సావకాశం సాకుగా తీసికొని చెనటులు కొంతమంది ఏకనాథుని దుయ్యబట్టాలను కొన్నారు. ఊళ్లోఉన్న బ్రాహ్మణ్యమంతా ఒక ఒప్పందానికి వచ్చినారు. అదేమిటంటే, ఈ బిచ్చగాడు ఏకనాథునికి కోపం రప్పించగలిగితే, వాళ్ళంతా కలిసి ఆతనికి రెండు వంద లిస్తామన్నారు. ఇదీ ఒప్పందం ! ఆ యాచకునకు ఏకనాథుని యిల్లు చూపింపగా, ఓస్ ! ఇదెంతపని నా కనుకొని ఆతడు ఏకనాథుడుంటున్న యింటికి తిన్నగా పోయి, ఆతని అనుమతి లేకుండగనే ఏకనాథుని పూజా మందిరములో చెప్పుల కాళ్ళతో అటు ఇటు తిరుగనారంభించినాడు ఏకనాథుడప్పుడు ధ్యాన సమాధి నిష్ఠుడై యుండి ఏమీ చలించలేదు. ఇది కాంచిన ఆ బిచ్చగాడు చేసేదేమీ లేక దీన వదనంతో సమాధి స్థితుడైన ఏకనాథుని తొడపై పడినాడు. అప్పుడు ఏకనాథుడు ప్రేమ పురస్సరంగా ఒక మందహాసం చేసి 'ఏమి ప్రేమిటిది ? నీవు నన్ను ఇంతకు ముందు కలుసుకొన్నావు. అయినప్పటికీ ఎంతో దూరంనుంచి మళ్ళీ నన్ను చూడటానికి వచ్చినట్లున్నావు. నాపైన ఎంత ప్రేమ వర్షించావు' అన్నాడు. ఆ మాటలకు యాచకుడు నిర్విణ్ణుడై ఏకనాథునితో "అవునవును. నేను చాలా దూరంనుండి వచ్చాను." అన్నాడు. అయితే లోపలికి రా! అని ఏకనాథుడు వానిని పిల్చి 'మన మిద్దరం గోదావరిలో స్నానం చేద్దాం పద. వంటసిద్ధంగానే ఉంది' అన్నాడు.

బ్రాహ్మణు డట్లే గోదావరికి వెళ్ళి ఎంతకూ స్నానం పూర్తి కాకుండా అట్లే ఉండిపోయినాడు. ఇంటిదగ్గర ఏకనాథు డతిథి రాకకై

మర్యాదగా నిరీక్షింపసాగినాడు. కాని పాపం బ్రాహ్మణునకు రెండు వందల రూపాయల ఒప్పందం మరింత క్లిష్టమయింది. ఎటూ చేయలేక చేతికి రాబోయే ధనం జారిపోతున్నట్లనిపించింది. ఏలాగైనా రెండు వందల పందెం గెలవటానికి నిశ్చయించుకొని, చిట్టచివరి ఉపాయంగా గిరిజాబాయి వెనుక వైపుకు దుమకాలని నిర్ణయించుకొని దుమికినాడు. అందరూ ఆశ్చర్య చకితులైనారు. కాని ఏకనాథుడు భార్య ఉన్న వైపునకు తిరిగి నవ్వుతూ 'జాగ్రత్త సుమా ! ఈ పెద్ద కుర్రాడు క్రింద పడగలడు' అన్నాడు. ఆమె, భర్త మాటలలోని ఆంతర్యము గ్రహించి భర్త కంటె ఎక్కువ ఓర్పుతో నిశ్చింతగా నిల్చి భర్తకు జవాబు చెప్పింది. "మీ రేమీ బాధ పడకండి ! నా వీపుపై కుర్ర వాణ్ణి మోయటానికే యిబ్బందీ లేదు. ఇంటి పనులు చేసికొంటూ పిల్లవాణ్ణి మోయటం నా కలవాటే కదా ! ఈ కుర్రవాడు నా వీపు మీదనుండి జారి క్రింద పడడు లెండి"

దీనితో ఆ పేద బ్రాహ్మణుడు స్తబ్ధుడైపోయినాడు. రెండు వందల రూపాయల కోసం ఎంతో తాపత్రయమున్నా, ఏకనాథ దంపతుల మధుర వాగ్జాలం ఆయనను అవశుణ్ణి చేసింది. ఎంతో అవమాన తప్తుడైనాడు. తోడనే ఏకనాథుని పాదములపై బడి వాటిని కన్నీటితో తడిపివేసినాడు. అటు పిమ్మట తన దయనీయ స్థితిని ఏకనాథస్వామికి నివేదించుకొన్నాడు. ఆ విషాదగాథను విని ఏకనాథుడా పేద వానితో నీ వా సంగతి నాకు ముందే ఎందుకు చెప్పవైతివి ? అట్లా నాతో చెప్పితే నీతో తలపడతా ననుకున్నావా? అని పలికి తన సేవకుని ఉద్ధవుని పిలిచి ఆయనకు రెండు వందల రూపాయ లిప్పించే ఏర్పాటు చేయించినాడు.

భక్త శిఖామణి తన యింటికి కేతెంచి భోజనం చేస్తే ఎంత బాగుండును' అని. అతడు మామూలుగా వచ్చి రోజు విన్నట్లే కీర్తనలు విని సంతసించిన సిమ్మట తన యింటికి దయచేసి పావనం చేయవలసినదనీ తానిచ్చే స్వల్పమైన ఆతిథ్యమును స్వీకరించవలసినదనీ స్వామిని అభ్యర్థించినాడు. ఆతని విన్నపము విని, తప్పక వచ్చి ఆతిథ్యమును స్వీకరించెద నని ఏకనాథుడు తెల్పినాడు. ఆ హరిజనుడా మాటలు విన్నంతనే, జన్మ సఫలమై సంతగా ఆనంద తరంగితుడై నాడు.

ఆ హరిజనుని సంతోషానికి అవధులు లేవు. క్షణంలో ఈ వార్త ఊరంతా గాలిలా వ్యాపించి పోయింది. విన్నంతనే కొంత మంది ఛాందసులు ఆందోళన పడినారు. మరి కొందరు ఆశ్చర్య చకితులైనారు. ఇక కొంద రా వార్తను నమ్మ జాలరైరి. అప్పటి నుండి ఊళ్ళోని జనులు ఏకనాథు నెప్పుడూ కనిపెట్టుకొని, తిరుగ నారంభించిరి. ఏకనాథస్వామి తన వాగ్దానాన్ని నెరవేర్చుకొంటాడా, ఒకవేళ నెరవేర్చుటమే జరిగితే ఊరంతా గగ్గోలయి పరిస్థితు లెట్లా మారతాయో అని ప్రజలందరు అనుకొనసాగినారు. ఆ ఊళ్ళో ఉన్న పండితులు - నైష్ఠికులు ఇదే విషయంపై వాగ్వాదాలు చేయ సాగినారు. ఈ వింత వార్త విన్న క్షణంనుంచీ ఛాందసులంతా తలలు బద్దలుకొట్టుకో సాగిరి.

ఆ మరునాడే రాము ఉన్న పూరి పాకలోనికి స్వామి ప్రవేశించినాడు. రాగానే ఏకనాథుని పాదపద్మములకు, రాము దంపతు లెంతో వినయంతో సాగిలపడి మ్రొక్కి, సాదరంగా నాహ్వానించి, ఒక చాపపై వారిని కూర్చుండ జేసినారు. ఏకనాథస్వామి చిరునవ్వు చిందులాడగా అమిత ప్రేమతో ఆ హరిజన దంపతులు పరచిన చాపపై కూర్చున్నాడు. వారు ప్రీతితో అరటిఆకులో వడ్డించిన

ఒకే కోవకు చెందిన పండితు లందరూ కలసి ఏకనాథుని కులం నుండి వెంటనే వెలి వెయ్యాలని అనుకొని, ఆయన ఇంటికి వెళ్ళి, వాని రాక కోసం ఎదురు చూడ నారంభింపగా ఒక అపూర్వ దృశ్యం వారి కంట పడింది. ఇట్లు హరిజనుని యింట విందారగిస్తున్న సమయంలోనే స్వామి, యథాప్రకారం తన యింటి దగ్గర భాగవత పురాణ ప్రవచనం చేస్తున్నారు. శ్రోతలంతా ముగ్ధులై వింటున్నారు. ఈ చిత్ర మేమిటో ఎవరికీ పాలుపోలేదు. స్వామి రాము ఇంటి దగ్గర ఉండగానే ఇక్కడీ విచిత్ర మేమిటి ? అని శంకించి కొందరు తిన్నగా రాము ఉంటున్న కుటీరమునకు పోయి చూచినారు. మహాశ్చర్యం !! అక్కడ ఏకనాథుడు ఎంతో ప్రశాంతంగా కూర్చుని రాము ఆతిథ్యానికి - చూపిన మర్యాదకు పొంగిపోతున్నాడు. ఏమిటిది ? ఏక కాలంలో స్వామి రెండు చోట్ల ఎట్లా వున్నట్లు ? ఏ రకమైన ఇంద్ర జాలం వల్ల స్వామి రెండు శరీరములు ధరించగాడు ? ఇట్లు కంటికి కనిపిస్తున్న రెండు శరీరాలలో ఏ శరీరం వాస్తవ మైనట్లు ? పండితు లంతా బిత్తరపోయి దిగ్భ్రాంతి చెంది, మోయరాని అవమాన భారంతో తమ తమ యిండ్ల కేగినారు ఏకనాథస్వామి 'ఇదంతా పాండురంగ విఠలుని పని కాని వేరొకటికాదు. భక్త రక్షణ మార్గాలలో ఇదొకటని భావించి' తానే యిట్లు సమన్వయించుకొనసాగినాడు. "దైవమే తన రూపాన్ని ధరించి పురాణ ప్రవచనం చేసినాడు, ఎవరు ఏమీ ఆతని గురించి అనుకొనడానికి వీలు లేకుండా !" పుర ప్రజ లందరు ఏకనాథుని భక్తి మహత్వమునకు ఆశ్చర్య చకితు లైనారు. పరమేశ్వరుని పాద సమాశ్రయణమే భక్తికి మూలము కదా !

భగవానుడు భక్తుని ఎంతో గాఢంగా ప్రేమిస్తాడు. ఒకసారి శ్రీఖండు డనే సేవకుని రూపం ధరించి ఓ రోజు కాదు - రెండు

రోజులు కాదు - పన్నెండేండ్లు ఏకనాథస్వామి భార్య గిరిజాబాయికి ఆ పరమేశ్వరుడే పలు విధాల పరిచర్యలు గావించినాడు.

ఒక పర్యాయము శ్రీ కృష్ణ సందర్శనార్థ మొక బ్రాహ్మణుడు ద్వారకకు రాగా, రుక్మిణీదేవి యిట్లు చెప్పినదట "శ్రీకృష్ణ భగవానుడు శ్రీఖండ నామధేయంతో సేవకుడుగా ఏకనాథు నింట పని చేయుచున్నాడు. నీవు దర్శనం చేసుకోవాలని భావిస్తే పైఠాన్ నగరానికి పోయి ఏకనాథుని దగ్గరకు వెళ్ళు." ఆ బ్రాహ్మణుడును, రుక్మిణీ చెప్పిన చొప్పున పైఠాను నగరమునకు పోయి ఏకనాథస్వామి యిల్లు చేరుకున్నాడు, ఆయన ఇంటి దగ్గర సేవకు డున్నాడు. ఆయనే శ్రీఖండుడు. ఆ సేవకుడే ఏకనాథస్వామి యింటి వివరములు చెప్పి చూపించినాడు. ఆ వచ్చిన వానిని నీ కేమి కావలెనని, ఎందులకు వచ్చితివని ప్రశ్నించినాడు. ఆతడు తాను ద్వారకా నగరము నుండి వస్తున్నానని, దైవమును దర్శించవలెనని చెప్పినాడు.

స్వామి : దైవము ఇందు గలడందు లేడని సందేహము వలదు. ఆయన సర్వవ్యాపి. నీవు సూటిగా చూడగలిగితే ప్రాణికోటి అంతా ఆ పరమాత్ముని స్వరూపమే. ఆ పురుషోత్తము డందరిలో నున్నాడు.

బ్రాహ్మణుడు : స్వామీ ! తమరింకోలా భావించనంటే ఒక్క సంగతి చెబుతా. ఈ వేదాంత మంతా నేనూ ఎరుగుదును. శాస్త్రగత విమర్శలెన్నో, పరమాత్మను గూర్చినవి, నాకు కంఠస్థాలు. వింటే తలక్రిందులుగా చదివిన దంతా అప్పచెప్పగలను. కాని ఈ వేదాంత మంటే ఎందుచేతో నా తల తిరుగుతోంది. ఆ పరంధాముని సాకారంగా దర్శించాలనేదే నా కోరిక. అందులకే ఇంత దూరం, ఇక్కడకు రావటం !

స్వామి : అయితే ఆ పరమాత్మ ఇక్కడే ఉన్నాడని నీవు ఎట్లా ఊహించావు ?

బ్రాహ్మణుడు : శ్రీఖండుడని ఒకడు నీ ఇంటి ఆవరణలో నున్నాడట ! ఆతని కోసం కబురు పంపు.

స్వామి : ఓ ! అదా ! శ్రీఖండు డిప్పుడే నీళ్ళు తేవటానికి నదికి వెళ్ళాడు.

ఆ వచ్చిన బ్రాహ్మణుడు, తాను చూచిన సంఘటనలన్ని ఒక దాని తర్వాత ఒకటి జ్ఞప్తికి తెచ్చుకొనసాగినాడు. తాను వచ్చేటప్పుడు త్రోవలో కలుసుకొన్నది, నీళ్ళు మోసే వానినే కదా! ఆయనే కదా తనకు ఏకనాథస్వామి యిల్లు చూపించింది. తటాలున ఏకనాథుని వైపు అర్థవంతముగా చూచి 'భగవంతుడే శ్రీఖండుని రూపంలో నీ యింట నున్నాడు' అన్నాడు. తోడనే ఏకనాథుడు గొంతెత్తి శ్రీఖండుని పేరు పెట్టి పిలిచాడు, పిలిచాడు. ఎంతకీ రాలేదు. అక్కడే ఉద్ధవు డిట్లన్నాడు "ఇప్పటి దాకా శ్రీఖండు డిక్కడే ఉన్నాడే !" వెను వెంటనే గిరిజాబాయి యిట్లు వ్యాఖ్యానించినది. "నీళ్ళ బిందెలన్నీ ఇక్కడుంచి అతను ఇప్పుడే పూజా మందిరములోనికి పోయినాడు. కాని చిత్రం ! ఆతని జాడ ఏ మాత్రం ఎక్కడా తెలియ రావటం లేదు."

ఏకనాథున కీ కథంతా స్ఫుటంగా అర్థమయినది. వెంటనే కొత్తగా వచ్చిన బ్రాహ్మణుని తనతో పూజా మందిరమునకు కొనిపోయినాడు. ఏకనాథుడు పాండురంగ విభుని భక్తి పురస్సరంగా ప్రార్థించినాడు. తోడనే ఆ మందిరాంతర్భాగ మంతా వెలుగుతో నిండిపోయింది. అది శ్రీ కృష్ణుని మహనీయ రూపమే ! అంతలోనే శ్రీకృష్ణ భగ వానుని రూపము సాక్షాత్కరించినది. ఇరువురూ ఆనంద బాష్పములు రాల్చినారు. శ్రీకృష్ణ పరమాత్మ ఆ యిరువుర నాశీర్వదించి మరు

క్షణమే అదృశ్యమైనాడు. ఆ విప్రుని ఆనందానికి అంచులు లేవు. ఆ బ్రాహ్మణుడు ఏకనాథునకు నమస్కరించి ద్వారకకు వెడలి పోయి నాడు.

ఏకనాథుడు ఆచార సంప్రదాయములు గల బ్రాహ్మణ కుటుంబమున జన్మించినా, ఎప్పుడూ ఏ విధంగానూ కుల భేదమును పరిగణింపలేదు సరికదా తానేవి ప్రవచనము చేయునో దానిని తాను సమాచరించి చూపిన ఋజువర్తనుడు. దైవము అందరి ఆత్మలలోను ఉంటాడు. కావున ప్రతి మానవుడు అందరి యెడల ఏకరీతిగా న్యాయబద్ధముగా వ్యవహరించుచుండవలెనని ఏకనాథు డభిప్రాయ పడినాడు.

ఏకనాథుడు తన తండ్రి తద్దినమునకు బ్రాహ్మణులను పిలిచి అత్యంత శ్రద్ధతో ప్రతి పర్యాయము సమారాధన చేసేవాడు ఆ రీతిగనే ఒకసారి తద్దినము రోజున గిరిజాబాయి యథావిధిగా తెల్లవారు జామునే లేచి స్నానము చేసి శ్రీఖండ, ఉద్ధవుల సహాయంతో వంట చేయ నారంభించింది. వంట చేస్తూండగా, వారి యింటి త్రోవ నుంచి కొందరు హరిజనులు పోతూ 'మంచి వాసన లొస్తున్నాయి. ఎవరో పిండి వంటలు వండుతున్నట్లున్నారు. కాని ఆ వంటకములు మనవంటి వారికి అందవు కదా' అనుకొంటున్నారు. ఈ మాటలు ఏకనాథుని చెవిని పడినాయి. తోడనే గిరిజాబాయిని పిల్చి ఆమెకు తాను విన్న సంభాషణ వివరించి 'పాపం! ఆ హరిజనులీ పదార్థాలను తినాలని ఉవ్విళ్ళూరుతున్నట్లున్నారు. వారిని పిలిచి ఈ వంటకాలు పెడదాం. మళ్ళీ మనం వంట చేసుకుందాం' అన్నాడు. ఆ మాట లాలకించిన గిరిజాబాయి భర్తతో "దానికేముంది? మీ మాట ఎప్పుడేనా తిరస్కరించానా? మీ మనస్సునకు ఏదైనా స్ఫురిస్తే అది ధర్మ సమ్మతమే అవుతుంది" అన్నది. ఆ మాటలు విన్న ఏకనాథుడు పరమానందభరితుడై ఉద్ధవుని పిలిచి హరిజనులున్న

పేటకు పోయి వారినందరిని రమ్మని పిలిపించి విందు చేసినాడు. మహా
నందంతో భుజిస్తున్న హారిజను లందరినీ చూచి ఆనందించటమే కాదు
అందులో ప్రతియొక్కనిలోను పరమాత్మను దర్శించగలిగినాడు.
సాక్షాత్తు దైవానికి పరిచర్య చేసినంత ఆనందముతో వారికి సేవ చేసి
నాడు. ఇట్లు వారలందరూ స్విష్టకృత్తుగా భోజనం చేసి తమ తమ
ఇండ్లకుపోయినారు. పిమ్మట గిరిజాబాయి మళ్ళీయిల్లంతా గోమయంతో
శుభ్రి మొనర్చి తాను కూడ స్నానము చేసి యథావిధిగా మళ్ళీ వంట
చేసి తద్దినమునకు భోక్తలుగా బ్రాహ్మణులను పిలిచినారు. అదేమిః
చిత్రిమో బ్రాహ్మణు డొక్కడూ కూడా ఆ చాయలకే రాలేదు పాపం
ఉద్ధవుడు మళ్ళీ మళ్ళీ వెళ్ళి బ్రాహ్మణులను బ్రతిమాలి పిలువగా
వారంతా రాలేదు సరికదా ఆయనను నానా దుర్భాషలాడి దుయ్య
బట్టినారు. అంతటితో ఊరుకోక వారంతా 'భానుదాసు ముని మను
మనికి ఇంత కంటె చేయదగిన పనే లేదా ? బ్రాహ్మణ ధర్మం ధ్వంసం
చేయడ మొక్కటే పనా' అన్నారు.

అది తెలిసి ఆ బ్రాహ్మణుల దగ్గరకు ఏకనాథుడే వెళ్ళి
ప్రాధేయపడి వారితో 'మొదట వంట చేసినది మీ కోసమే. కాని
హరిజను లా వంట వాసన చూచినారు. మీ అందరి అభిప్రాయము
ప్రకారము ఆ వంటంతా అపవిత్ర మైనట్లే. అందుచేత వారినందరినీ
పిల్చి ఆ వంటకాలన్నీ వారికి వడ్డించిన మాట వాస్తవం. మళ్ళీ
మే మిద్దరమూ స్నానముచేసి స్థల శుద్ధి, భాండశుద్ధి కావించి తిరిగి
వంటలు సిద్ధం చేసినాము. మీరు దయచేసి ఈ శ్రాద్ధకర్మను యథా
విధి జరిపించవలసింది' అన్నాడు. విన్న బ్రాహ్మణులంతా ఏకనాథునిపై
మండిపడి నానా చీవాట్లు పెట్టి 'వెళ్ళు'! వెళ్ళు'! మీ పితృదేవత
లందరికీ సుష్టుగా పెట్టుకో ! ఆ హరిజనులు తిన్న యింటిలో మేము
ససేమిరా విస్తరి వెయ్యము. పో ! పో ! నీ పితృదేవతలకు పెట్టి
ఆనందించు!' అన్నారు ఏక కంఠంగా. అప్పుడు శ్రీ ఖండుడు లోపలికి

సమాధానము చెప్పి వెళ్ళిపోయినారు.

శ్రీ ఖండు ఏకనాథుని చేయిపట్టుకొని యింటికి తీసికొని వెళ్ళినాడు. ఆశ్చర్యం! అద్భుతం! ఇంటిలో ఏకనాథుడు ప్రవేశించుసరికి పితృదేవతలంతా పీటలపై ఆసీనులై యున్నారు. ఆ దృశ్యమును చూచి కన్నులు మూసికొని పాండురంగ విఠలుని ప్రార్థించినాడు. ఉగ్రకోపనులైన విప్రులిదంతా దూరంనుంచి చూచి చల్ల చల్లగా తమ తమ యిళ్ళకు జారుకున్నారు. ఏకనాథుని అంతస్తును వారి పరిమిత దృష్టి అందుకోలేకపోయింది! వారందరి ప్రజ్ఞా - ప్రతిభా అంతవరకే పరిమితం.

స్వామి జ్ఞానేశ్వరుని తరువాత, మరాఠీ భాషలో భాగవతమును వివరణపూర్వకంగా వ్రాసినవారిలో ఏకనాథు డొకరు. ఆతడనువదించిన భాగవతములోని నాలుగధ్యాయములు వ్రాసిన ప్రతినొక శిష్యుడు కాశికి గొనిపోయి, అక్కడ మణికర్ణికా ఘట్టమున ప్రశాంతముగా కూర్చుండి భాగవతమును వినిపింపసాగినాడు ఆ భాగవత ప్రవచనము వినటానికై వేలకొలది ప్రజలు వస్తూండేవారు. ప్రవచనం చేసే శిష్యుని కంఠము మధురాతి మధురంగా నుండెను అక్కడికి వచ్చే శ్రోతలలో కొందిమంది మాత్రమే మరాఠీవారు. వారు ఏకనాథుని భాగవతములోని వాఙ్మాధుర్యమును వినువలేక పోయేవారు. శ్రోతల కవగాహన యగుటకై ఉత్తర దేశీయ ప్రాకృతంలోనికి విషయముల ననువదించి ఆ శిష్యుడు చెప్పేవాడు.

ఇది యిట్లు జరుగుతుండగా స్థానిక మఠములో వేంచేసియున్న మహంతునకు, భాగవత ప్రవచన కథా విశేషములు కొందరు తెల్పినారు. అంతటితో వారు ఊరుకోక ఏకనాథుని శిష్యుడు సంస్కృత భాగవతమును భ్రష్టు పట్టించు చున్నాడని నిందించి బెదరింపసాగిరి.

మీ గురువును తీసుకొని రావలసినదిగా దురహంకారంతో ఏకనాథ శిష్యుని సవాలు చేసినారు. అప్పు డేకనాథ శిష్యున కే దాకి తోచక దైవాన్ని మనసార స్మరించి మహంతుకు పరిహారముతో 'నేను అంత పెద్దగా చెప్పుకొనదగిన ప్రతిభావంతుడను కాను. మేధస్సూ అంతంత మాత్రమే. పైఠాన్ మహానగరములో మా గురుదేవులు ఏకనాథ స్వామి ఉంటున్నారు. వారు మరాఠీలోనికి సంస్కృత భాగవతము ననువదించినారు. ఆ మహనీయుడు ఋషి కల్పుడు. సామాన్య ప్రజానీకానికి భాగవతముయొక్క రుచి అందించాలనే విశాల దృక్పథంతో వారు దీనిని అనువదించినారు' అన్నాడు.

ఆ మాటలను విన్న మహంతు ఏకనాథుని చూడవలెనని, తన శిష్యులద్వారా ఒక లేఖను వ్రాసి పంపినాడు. ఈలోగా ఏకనాథస్వామి పంచమ స్కంధముకూడ అనువదించుట పూర్తి యైనది. మహంతు పంపిన లేఖను చూచి తానసువదించిన పంచమ స్కంధమును కూడ తీసికొని ఏకనాథుడు కాశీక్షేత్రమునకు వచ్చినాడు. అందరూ ఏకనాథస్వామిని సందర్శించిరి. చూచీ చూడగనే అందరికీ ఒక పవిత్రత, ప్రశాంతత అనుభూత మయింది. ఆ మహాభక్తుని సందర్శనము వలన పునీతు లైతిమని, ఉద్ధరింపబడితిమని వచ్చినవారంతా తలపోసినారు. కాని మహంతుకు మాత్రము ఔద్ధత్యము పోలేదు. ఏకనాథస్వామిని వెలివేయబడిన వానివలె, ఎంచి' రెప్పనెత్తి చూచుటకేని యిచ్ఛగింప లేదు. ఆ మహనీయునితో మాట్లాడితే తానపవిత్రుడనై పోదు నన్నంత వరకు అహంకారము ప్రబలిపోయినది. దానితో ఇరువురకు నడుమ ఒక తెర వేయించి ఏకనాథుని ప్రశ్నించినాడు. ఎందులకు తనకు వర్తమాన మంపించితిరని ఏకనాథు డడుగగా మహంతు, ఇట్లు చెప్పెను. "ప్రాకృతుల భాషలో పరమ పవిత్ర గ్రంథాలు అనువదించినా, ప్రచారము చేసినా అట్టివారు వెలివేయబడినవారి క్రిందనే జమ అని నా మనస్సుకు తోస్తున్నది. నేనలాంటి వాళ్ళను చూడాలను

కోవటం లేదు. మీరు దేవభాషను (సంస్కృతము) న్యూనత పరుస్తున్నట్లుగా పరిగణిస్తున్నాను.' అక్కడ సమావిష్టులైన వారంతా ఏక కంఠంతో నిజం! నిజం! అని కేకలు వేసిరి. కొంత సేపటికి ప్రశాంత పరిస్థితి యేర్పడగా, ఏకనాథుడు తన వాదము నిట్లు సమర్థింప సాగి నాడు.

"ఓ భగవాన్! మహా ప్రభూ! నీ స్థాయిని - వివేకాన్ని సమాదరిస్తూ నేనే ఈ రచన చేసినట్లు భావించుటలేదు మహా భాగ వతము మహత్తర పవిత్ర ప్రబంధము. కాని యీ మహాగ్రంథము జనసామాన్యమునకు అందుబాటు కాకుండా పోయినది. ఆ భాగవత రహస్యమును ప్రకాశింప జేయు నుద్దేశ్యముతో మూల భాగవత మందలి అందచందములు తీసికొనిరావలెనని మరాఠీ భాషలో అను వదించినాను. ఓ స్వామీ! నన్ను క్షమించు. అయినా ఒక్కమాట. దేవతలు సంస్కృతం సృష్టిస్తే, దొంగలు ప్రాకృతాన్ని సృష్టిం చారా? ఒకసారి నా ప్రార్థన విను. మహా ప్రభూ! నేను చేసిన అనువాదంలో ఏమైనా తప్పులు గాని, అనన్వితాలు గాని, అసంగ తాలు కాని, అర్థావబోధమున తికమకలుగాని ఉంటే ఈ అనువాద గ్రంథాన్నిప్పుడే గంగామాత కర్పణం చేస్తా. స్వామీ! నా విన్న పాన్ని ఆలించి దీన్ని పరీక్షించు" అన్నాడు.

అయితే చదువు వింటానన్నాడు మహంతు. ఆ రోజున దేశం నలుమూలల నుంచీ పలువురు మఠాధిపతులు, పండిత ప్రకాండులు కాశీ క్షేత్రంలో జరిగే సభకు విచ్చేసినారు. ఏకనాథు డెంతో భక్తి ప్రప న్నత లుట్టిపడేట్లు ఆ మహా సభలో శ్రుతిమధురంగా మంద్ర స్వనముతో సుకుమార కమనీయ గాత్రంతో భాగవత పఠన మారం భించినాడు ఏకనాథుని అనూదిత భాగవతములోని ధారాశుద్ధి, యమకము, పదబంధ వైచిత్రి, మహోన్నత భావసంపద విన్నవారిని మంత్రముగ్ధుల్ని చేసింది. శ్రోతల కన్నుల నుండి జలజల మని ఆనంద

నారి ధారలు రాలినాయి. ఆ మహాభక్తి స్రోతస్సులో తన్మయులై అందరూ మునకలు వేసినారు. అనుకోని రీతిలో మహాంతు అడ్డంగా కట్టిన తెరను తీసివైచి భక్తాగ్రేసరుడైన ఏకనాథుని గాఢముగా కౌగలించు కొన్నాడు. అప్పుడు కాశీలోని పురజనులు, మహాసభకు విచ్చేసిన పీఠాధిపతులు ఏక కంఠంతో మహా భాగవతమును సాంతము తమకు వినిపింప వలసిన దని ఏకనాథుని కోరినారు. ఆ మహాభాగు డందుల కంగీకరించి ఒక వత్సరకాలము పవిత్ర కాశీ క్షేత్రమునందే యుండి భాగవత ప్రవచనము గావించినాడు. ఏకనాథస్వామి అంతకు ముందే జ్ఞానేశ్వరునిచే రచింపబడ్డ భాగవతమును బహువారములు పఠించుటే కాదు, ఆ మహానీయుని అమృతానుభవాది కృతులను కూడా లోతుగా చదివినాడు. ఆ రచనలలోని మధుర భావములు, శైలీ విన్యాసమును పుణికి పుచ్చుకొన్నాడు. కొన్ని కొన్ని పట్టులందు ఏకనాథుని అనువాదము మూలాతిశాయిగా నున్నది. మరికొన్ని చోట్ల మూలకృతి కంటె వివరణలు చోటుచేసుకున్నాయి. అయినా ఏకనాథుని కవితాశక్తిని కొంతమంది మాత్రమే అందుకో గలుగుతున్నారు.

మహాంతు బ్రహ్మానంద భరితుడయి ఏకనాథస్వామిని ఊరేగింపుగా కాశీ పట్టణమంతట త్రిప్పవలెనని, ఆ ఊరేగింపునకు ముందుగా ఏకనాథుడు గజారోహణము చేయవలెనని, తన కోరికను తెల్పినాడు. ఏకనాథుడు సహజముగా నిరాడంబరుడు, నిర్లిప్తుడు, ఋషితుల్యుడు. ఎంతో వినయంతో ఆ కోరికను తిరస్కరించుచు తా మంతా ఊరేగింపులో నడచి వచ్చుచుండగా తానొక్కడూ గజారోహణము చేయుటకు సమ్మతము కా దన్నాడు. అప్పుడు ఏకనాథుని కోరికపై ఆయన రచించిన మహాభాగవతమును ఊరేగించినారు. పండితులు వేదస్వస్తి చెప్పుచుండగా, ఇరుప్రక్కల జనము కుంకుమ జల్లుతుండగా ఆనందకోలాహలంగా బుక్కా చల్లుకుంటూ

చెప్పినాడు.

భాగవతప్రవచనము పూర్తైన మరునాడు కాశీలోని గంగోదకమును పాత్రలో తీసికొని దక్షిణాదిలోనున్న రామేశ్వర క్షేత్రములో కలుప వలెనను తలంపుతో గోదావరీ తీరం చేరే సరికి వేడిమిని భరించలేకపోయినాను. అంతా పాదయాత్రే. ఇసుకతిప్పలలో నడుస్తుంటే కాళ్ళు బొబ్బలెక్కిపోయినాయి. ఎక్కడా చింతాకంత నీడ కూడ దొరకలేదు. మండిన బూడిదరాశి మాత్రముంది. ఆతనితో ప్రయాణించే యాత్రికులంతా ఎండ తీవ్రతకు తహతహలాడిపోతున్నారు. అంతలో ఒక గాడిద ఎండబాధకు, దాహబాధకు తాళలేక దయనీయావస్థలో నుండి నీళ్ళకై పరితపిస్తూ ముందుకు పోలేకపోతోంది కాని, గోదావరి నీరు తగిలే చోటు ఇంకా చాల దూరంగానే ఉన్నది. ఏకనాథుడు కూడా ఇసుక తిప్పలలో నడువలేకపోతున్నాడు. కాని గాడిద పడే దురవస్థను చూచి ఒక క్షణ మాగి తాను పాత్రలో పదిలముగా తెచ్చుకొంటున్న పవిత్ర గంగా జలమును దాని గొంతుకలో పోసినాడు. అది చూచి తోటి యాత్రికులంతా ఎంతో భక్తిశ్రద్ధలతో ప్రయాసపడి తెచ్చుకొన్న గంగాజలాన్ని ఎట్లా వదలినాడని చూచిన వారంతా రిత్తపోయారు. ఉద్ధవుడు ఏకనాథునితో 'రామేశ్వరమునకు మన మేమి తీసుకొని వెడుతున్నట్లు?' అన్నాడు. ఏకనాథుడు తన చూపుడు వ్రేలితో గాడిదను చూపుతూ ఒక్క మాట అన్నాడు. 'ఇదే నా రామేశ్వరం'.

కొన్నేళ్ళు గడచిన తర్వాత, ఏ కారణమూ లేకుండానే ఏకనాథుని గొంతు వాచి భరించలేని బాధ పెట్టింది అట్లా దురవస్థ పడుతున్నరోజుల్లోనే, ఏకనాథున కొకసారి కలవచ్చింది. దాని సారాంశ మిది ఎప్పుడో మూడు శతాబ్దాల క్రిందట పరమ పదించిన

జ్ఞానేశ్వరుని మహాసమాధి 'అలంది' దగ్గర ఒక గుహలోనున్నది. అది క్రమంగా పూడి పోయింది. ఆ చోటులో ఒక అజన వృక్షము మొలిచి దాని వ్రేళ్ళు సమాధిలోకి చొచ్చి జ్ఞానేశ్వరుని బాధించుచున్నవట! ఏకనాథుడే వచ్చి ఆ చెట్టు పెరికివేయవలసినదిగా ఆయన చెప్పినట్లయినది. ఆ మరునాడే ఏకనాథస్వామి ఉద్ధవునకు వర్తమానం పంపి 'అలంది' ప్రయాణానికి సన్నాహాలు చేయమన్నాడు. తరువాత వారిద్దరూ 'పైఠాను' నుండి కొంతమంది పరివారంతో బయలుదేరినారు. దోవలో వాయిద్యాలు వాయించుకుంటూ - కీర్తనలు పాడుకొంటూ - ప్రయాణించారు. 'అలంది'కి వారంతా చేరుకొన్నారు. కాని సమీప సిద్ధేశ్వరాలయ ప్రాంత మంతా అప్పటికి అరణ్యంగా మారిపోయింది. ఏకనాథస్వామి, ఆయన బృందమూ చీమలు దూరని ఆ జీబుటడవిలో అజన వృక్షమును గుర్తు పట్టుసరికి చాలసేపు పట్టింది. సరిగా ఆ వృక్షమూలము క్రిందే జ్ఞానేశ్వరుని మహాసమాధి యున్నది. అక్కడ గుహాముఖము కడ దగ్గరగా మట్టిలో కప్పబడియున్న బండరాతిని ఎట్లో తొలగించి మెల్ల మెల్లగా అందరూ గుహలో ప్రవేశించారు. అక్కడ మహా తేజస్వంతముగా ప్రకాశిస్తున్న జ్ఞానేశ్వరుని సూక్ష్మశరీరమును, స్వయంప్రభ కలదానిని ఏకనాథు డొక్కడు మాత్రమే దర్శింపగలిగినాడు. ఆ సమయంలో గుహా ప్రదేశమంతటా ఒక అపూర్వ పరిమళము వ్యాపించి యుండెను. అప్పు డేకనాథుడు జ్ఞానేశ్వరునకు నమస్కరించి, ఆ వృక్షపు వ్రేళ్ళను నరకించినాడు. వెంటనే జ్ఞానేశ్వరుని దివ్యవాక్కు లాయనకు వినవచ్చినవి. ఓ స్వామినాథ! నిన్ను ఇక్కడకు రప్పించుటకే చెట్టువేరు ఒక మిష. గడచిన మూడు వందలయేళ్ళల్లో నా గ్రంథము 'జ్ఞానేశ్వరి' కువ్యాఖ్యలతో అసంగత విషయాలతో ఎంతో రూపు చెడిపోయింది. ఎన్నో అధిక పాఠాలు అందులో చేరాయి. నేను కోరేదేమంటే, నీ వా గ్రంథాన్ని కూలంకషంగా శోధించి సాంతము యథా మూలముగా తిరిగి వ్రాయి. నేనే వ్రాసి యుండినచో నెట్లుండెడిదో అట్లే

జ్ఞానేశ్వరునితో సంప్రదిస్తూ మహానంద భరితుడై ఆయన పాద పద్మములపై బడి మోకరిల్లినాడు. ఆ తర్వాత గుహనుండి వెలుపలకు వచ్చి మనసార దైవమును సంకీర్తించినాడు.

'జ్ఞానేశ్వరి' కృతిని సమూలముగా పరిష్కరించుట కాతనికి సంవత్సరకాలము పట్టినది. ఈ నాటికిని ఏకనాథ పరిష్కృత ప్రతి యొక్కటే దేశమునందు బహుళ ప్రచారములో నున్నది. ఏకనాథుడు పండరీపురములోని పాండురంగ విఠలుని భక్తితో సేవించుకొన్నాడు

ఒక పర్యాయము 'కృష్ణదాసు' అనే వృద్ధ బ్రాహ్మణుడు ఏకనాథుని సమీపించి సవినయంగా ఇట్లు విన్నవించుకొన్నాడు. " స్వామీ నేను రామాయణము వ్రాస్తున్నాను. అది ఇంకను అసంపూర్తిగా ఉండిపోయింది ఇటీవల ఒక జ్యోతిష్కుడు వచ్చి 'నా జీవితము త్వరలో ముగియనున్నదనీ, కాలమాసన్నమైనదని' చెప్పి పోయినాడు. దానితో నాకు దుఃఖము కలిగింది. నా జీవిత పరమార్థము రామాయణ రచనము. అది పూర్తికాకుండ చనిపోవుచున్నాననియే నా తపన. కావున నా కొరకై మీరు రామాయణమును పూర్తిచేయండి." ఏకనాథుడు కృష్ణదాసు చేతిలో నున్న రామాయణము వ్రాత ప్రతిని చూచి, ఎంతయో సంతృప్తి పడి వానితో 'ఈ గ్రంథ పరిసమాప్తి కెన్ని రోజులు పడుతుంది' అన్నాడు. 'పది రోజులు స్వామీ !' అన్నాడు కృష్ణదాసు.

అయితే సరే బాగుంది. నీ విక్కడే ఉండి ఆ గ్రంథాన్ని పూర్తి చెయ్యి. ఈ పదకొండు రోజులు మృత్యువు నిన్ను సమీపించదు' అన్నాడేకనాథుడు

అట్లే కృష్ణదాసు అందే ఆగి, పదకొండు దినాలలో రామాయణ మహాగ్రంథము యొక్క అనువాదమును పూర్తిచేసి కన్ను మూసినాడు. అంతటితో కృష్ణదాసు ఆత్మ ప్రశాంత పడింది.

పైఠాన్ నగరంలో తరచుగా ఒక సన్యాసి తిరుగుతూ కని పిస్తుండేవాడు. కాని ఆతని అలవాట్లు మాత్రం మిక్కిలి విచిత్రమైనవి. ఎవరు ఎక్కడ కనబడినా, నిరాలస్యంగా సాష్టాంగ పడేవాడు. ఆయన శైవభక్తిలో తీవ్ర నిష్ఠుడు. ఎవరు తనకు కన్పించినా వానిలో శైవ మున్నాడని ఆ సన్యాసి పరమ విశ్వాసము. నిజ మంతటిదే. అతనిని అందరూ ఎంతో ప్రీతిగా 'దండవత్ బాబా' అని పిలుస్తూండేవారు. ఒకనాడు ఆ సన్యాసి నడుస్తూంటే త్రోవలో గాడిద శవం పడి వుంది. కొంతమంది ఆకతాయి పిల్లలు సన్యాసికి ఆ మృత కళేబరమును చూపి 'దానికి నీ వెందుకు ప్రణామము చెయ్యవు' అన్నారు. అందుల కంగీకరించి బాబా దానికి మోకరిల్లినాడు. చిత్ర మేమంటే, ఆ చచ్చిన గాడిద, స్వామి ప్రణమిల్లగానే బ్రతికి లేచి పరువెత్త సాగింది. ఆ చెవిని ఆ చెవిని ఆ వింత వార్త ఏకనాథునకు తెలిసింది. ఆయన బాబా వున్న చోటుకు వచ్చి 'నీ వెందుకు గాడిదను బ్రతికించినిట్లు' అన్నాడు.

నిస్సహాయంగా నా కేమీ తెలియదు బాబూ ! నే నేమీ చేయ లేదే' అన్నాడు బాబా అమాయకంగా. అప్పు డేకనాథుడు బాబాతో 'నీవు గ్రహించినావో లేదో ! నిన్ను ప్రజ లెల్లా దుర్వి ని యోగ పరచుకొంటున్నారో చూచావా ? రేపటినుంచి ఊరి వారంతా చనిపోయిన వాళ్ళను బ్రతికించమంటారు. అప్పుడు నీవేం చేస్తావు ?' అన్నాడు.

బాబా చేతులు చాచి ఏకనాథునితో 'నీవే చెప్పు నా కేది మంచిదో !' అన్నాడు. ఏకనాథుడు సన్యాసి కుండవలసిన ఆదర్శము లను వానితో ఇట్లు చెప్పినాడు. 'సన్యాసులకు ప్రపంచములో దేని తోనూ బంధా లుండకూడదు. చావు - బ్రదుకులు రెండూ వారికి సమానమే. వారు నిరంతరమూ ఆత్మానుసంధానంలో సంలీన

మవుతారు. పూర్ణయోగస్థితిలో వారుంటారు. నీవు మహాసమాధి స్థితిని పడసినావు. కావున దేహబంధాలను వీడితే బాగుంటుంది.' అన్నాడు. ఈ పలుకులు బాబా హృదయానికి బాగా హత్తుకొని ఎంతో ఊరట కలిగించాయి.

పైఠాన్ నగరములోని పండితు లంతా మత్సరగ్రస్తులు, కక్ష సాధించే స్వభావం గలవారున్నా. వారి చర్యలన్నీ అవే బహిర్గతం చేస్తున్నాయి. నగరంలోని బ్రాహ్మణు లంతా కక్ష కట్టి ఏకనాథుని పై దుష్ప్రచారము చేయనారంభించినారు. ఏకనాథస్వామి ఎంత చెప్పినా, వారు వినిపించుకొనే స్థితిలో లేరు. ఊరిలోని వారంతా శివాలయంలో సభ ఒకటి యేర్పాటు చేసినారు. ఆ సభలో ఏకనాథుడు తా నంతకుముందెన్నో పర్యాయములు చెప్పిన విషయమునే మరల ఉద్ఘాటించినాడు. 'నే నెవరినీ బలవంత పెట్టలేదు. దైవమే దానికి సాక్షి. నేను దోషిని కాను' అన్నాడు. సభలో నున్నవారిలో ఒకడు లేచి ఏకనాథునితో 'సరే బాగుంది, నీవు చెప్పినదంతా. నీ అమాయకత్వమునకు - అజ్ఞానానికి - అవివేకానికి దైవమే సాక్షి అయితే, పరమ శివుని వాహనమైన నందిచేత, నా చేతిలో నున్న పిండి తినిపించు చూద్దాం. దైవమే ఈ వృషభానికి గడ్డిని ఆహారంగా చేసియుంటే నాసినే అది తింటే, నిన్ను మేము వదలివేస్తాం, లేకపోతే .............

'ఎంత మూర్ఖులు వీళ్ళు' అనుకున్నాడు తనలో ఏకనాథుడు. వీ రడిగినదే పాండురంగ విఠలుని కోర్కైతే, ఈ సమస్య నాతడే తన కుచిత మని తోచిన రీతిని పరిష్కరించుకొంటాడని తనలో తాననుకొని, ఏకనాథుడా పండితుని చేతిలోనున్న పిండిని గైకొని, గుడి ముందున్న నంది దగ్గరకు పోయినాడు. పండితు లంతా విరగబడి నవ్వినారు. అయితే ఆ పండితు లంతా చాలాసార్లు ఏకనాథుని

మహిమలను కన్నవారు, విన్నవారుకూడ. అద్భుతా లెన్నో కన్ను లారా చూచినవాళ్ళు. కాని ఎందుచేతనో ఏకనాథస్వామి కీ విచిత్ర మైన పరీక్ష పెట్టినారు.

వెంటనే ఏకనాథు డా శివాలయములో నున్న నందీశ్వరునకు వంగి నమస్కరించి, దాని వీపుపై చేతితో నిమిరి, మెల్లగా అప్ప ళించి దాని తలను తాకి తాను దోసిటితో తెచ్చిన పిండిని దాని నోటి కందించినాడు. పరమాద్భుతము !! ఆ నందివాహనము పడుకొన్నది పరమాశ్చర్యముగా లేచి కొన్ని అడుగులు కదలి సమీపములోనే యున్న గోదావరీనదిలోనికి నడుస్తూ క్షణములో మాయమైనది. అందరూ విస్తుపోయి, ఏకనాథునకు మోకరిల్లి క్షమాపణ చెప్పు కొన్నారు. ఇట్టి మహిమ లెన్నో ఏకనాథుడు తన జీవితములో చూపించినాడు.

ఏకనాథున కొక్కడే కొడుకు. ఆతని పేరు హరిపండితుడు. ఎంతో చక్కగా చదువుకొన్నాడు. కాని ఆశా వలయములో చిక్కు కొన్నాడు. మహా గర్విష్టి. తనతండ్రి, మరాఠీ భాషలో సంస్కృత గ్రంథాలను అనువదించి ప్రవచనంచేసి ప్రజలలో ప్రచారమునకు తీసికొనిరావటం ఆతని కే మాత్రమూ నచ్చలేదు. దేవ భాషలో నున్న పవిత్ర గ్రంథాలను ప్రజల భాషలోని కనువదించుట మహాపరాధ మని హరిపండితుని నమ్మిక. అయినప్పటికీ హరి తన తండ్రిని ప్రేమానురాగములతోనే చూచేవాడు. తండ్రి నెప్పుడు ఆయన ముఖాముఖిగా తూలనాడలేదు. హరికి తన తండ్రి ధోరణిమాత్రం నచ్చలేదు. ఇక ఇంట్లో ఉండుట మంచిది కాదని భావించి, హరి భార్యా పుత్రులతో కాశీ యాత్రకు నిర్ణ యించుకొన్నాడు. కాశీకి వెళ్ళటానికి కారణ మేమిటని ఏకనాథుడు కుమారు నడుగగా హరి తన నిర్ణయము మారదనీ తాను కుటుంబంతో

చెప్పినాడు. తాను కాశీకి పోవుట ఉభయులకూ మంచిదనుకొన్నాడు. అట్లే హరి కుటుంబముతో కాశీ కేగినాడు. ఏకనాథుడు కుమారుని రాకకై నాలు గై దేండ్లు నిరీక్షించినాడు. ఎందరిచేతనో కబురు పెట్టి నాడు. హరి మాత్రము మొండి పట్టుదలతో ససేమిరా ఇక పైఠానుకు రానన్నాడు.

ఇట్లా సంవత్సరాలు దొర్లినాయి. ఏకనాథున కేమీ తోచ లేదు. చిట్ట చివరకు తన మనస్సున కెంతో వ్యతిరేక మనిపించినా, తానిక మరాఠీలో పురాణ ప్రవచనము చేయనని కుమారునకు వాగ్దా నము చేస్తున్నట్లు కబురు పంపినాడు. అంతేగాక తన కుమారుని సంస్కృతములోనే పురాణ ప్రవచనము చేయుమని కోరినాడు. దానితో హరిపండితుని పట్టుదల సడలి తోడనే సకుటుంబముగా హరిపండితుడు కాశీ వదలి 'పైఠాను' నగరము చేరుకొని సంస్కృ తంలో పురాణ ప్రవచనం చేయ నారంభించినాడు. పురాణము వినడానికి వచ్చే శ్రోతలు క్రమ క్రమంగా పలుచబడుతూ వచ్చారు. అయినా హరి ఏమాత్రము చలించ లేదు. ఎప్పటిలాగునే పురాణము చెబుతూనే ఉన్నాడు. ఇట్లా కొన్నాళ్ళు జరిగినతర్వాత ఊరివారంతా కలసి వచ్చి, ఏకనాథుని పురాణం చెప్పవలసిందిగా ప్రాధేయపడి అడిగినారు. అప్పు డేకనాథుడు భక్తజనుల కోరికను మన్నించి, సర్వ జనాహ్లాదంగా మరాఠీభాషలో మహాభాగవత పురాణప్రవచనం చేయ మొదలిడినాడు.

ఒకసారి పురాణమునకు వచ్చే శ్రోతలలో ఒక వృద్ధురాలు ఏకనాథుని సమీపించి ఒక వింత కోరిక కోరింది. ఎంతో కాలంగా ఆమెకు వేయిమంది బ్రాహ్మణుల కన్న సంతర్పణ చేయాలని అభిలాష ఉన్నది. కాని ఆమె సంపదంతా కాలక్రమంలో కరిగిపోయి పేదరాలై నది. కోరిక మాత్ర మామెను వీడలేదు. ఎంత కోరిక ఉన్నా లేమి

చేత ఏమీ చేయలేక పోతున్నది. ఎట్లాగైన ఆమె కోరిక ఆలోచన తట్టింది. మహాభక్తశిఖామణి ఏకనాథుని భోజనమునకు పిలిస్తే, వేయి మందికి సంతర్పణ చేసినట్లే అని భావించి, ఒకనాడేకనాథుని ఆమె తన యింటికి విందుకు రావలసిందిగా ఆహ్వానించింది. అంతకు ముందే తానెక్కడకు విందునకు పోనని కుమారునకు ఏకనాథుడు మాట యిచ్చినాడు. అది ఒక ప్రతిబంధకమయింది. అయినా వృద్ధురాలి తీరని కోర్కెను మన్నించే మనసుతో, ఏకనాథుడు కుమారునితో ఈ విషయాన్ని ప్రస్తావించినాడు. ఆ దయనీయురాలిని చూచిన హరికి కూడ ఆమె యెడల జాలి కలిగింది. అయితే ఒక్క షరతుమీద ఆమె ఆతిథ్యమును స్వీకరింపవలసినదిగా హరి, తండ్రిని కోరినాడు. ఆ షరతు ఆ వృద్ధురాలి యింట హరి తానే వంట చేయుదు నన్నాడు. ఆ ముసలియవ్వ కీ సంగతిని తెలుపగా ఆ వింత నిబంధన కామెయు నెట్లెటో అంగీకరించింది.

ఆ మరునాడు పెందలకడనే లేచి హరిపండితుడా వృద్ధురాలి యావాసమున కేగి, చిన్నగా నున్న వంటయింటిలో ప్రవేశించి సంబారములన్నింటితో చక్కగా వంట చేసి, తానే తండ్రి ఏకనాథునకు ఆ ముసలమ్మకు ఒకే పంక్తిలో కూర్చుండబెట్టి వడ్డించినాడు. అయితే ఆ ముసలియవ్వ ఎట్లు వండినదో తెలియదు కాని ఒక చిన్న గిన్నెలో తాను వండిన వంటకమును ఏకనాథుని విస్తరిలో వడ్డించినది. ఆ చర్య హరిని యిబ్బంది పెట్టకపోలేదు. అయినా హరి శాంతిని కోల్పోలేదు.

భోజనా లయినాయి. చేతులు కడుగుకొనుటకు ఇద్దరూ లేచినారు. ఏకనాథుడు అన్నం తిన్న విస్తళ్ళు వేలితో చూపుతూ హరితో 'ఆ ముదుసలికి అన్నం తిన్న విస్తరాకులు తీసే శ్రమ కలిగించకు. ఆ పని నీవే చేస్తే బాగుంటుంది' అన్నాడు. హరి దాని కంగీకరించి విస్తళ్ళను తీయుటకై వంగి తండ్రి తిన్న ఆకును

తీసినాడు. తీరా చూస్తే ఆ ఆకు క్రింద మరొక ఆకు కనిపించింది. పై ఆకు చిరుగుతుందను కొని ఇంకో ఆకు క్రింద వేశారేమో అను కొని సరిపెట్టుకొని దానిని కూడ చేతితో ఎత్తినాడు. పరమా శ్చర్యము!! దాని క్రింద ఆకు, దాని క్రింద మరో ఆకు, దాని క్రింద యింకొకటి ఇలా కనిపించినాయి. హరి ఎన్నిసార్లు విస్తరి యెత్తినా ఇంకొకటి కనపిస్తూనే యున్నది. అట్లా తీస్తూనే ఉన్నాడు హరి. కుతూహలంతో ఎన్ని ఆకులు తీసినదీ లెక్క పెట్టగా వేయి ఆకు లైనాయి. అప్పటికి, హరి మనస్సులో స్ఫుటంగా వివేకోదయ మైనది. పురాణాలలో నున్న అక్షరాలు కాదు మనము గణించ వలసింది, ఆ అక్షరాల వెనుక దాగియున్న మహార్థమునూ, మహా విశ్వాసమునూ లెక్కలోనికి తీసుకోవలెననుకొన్నాడు.

ఏకనాథుడు హరిజను నింట భోజనము చేయుట, ప్రజాభాష మరాఠీలో పురాణ ప్రవచనము చేయుట, దేవ భాషలో నున్న పురాణాల అందచందాలను అర్థాలను, అపూర్వ విషయాలను ప్రజలు తమ మాతృభాషలో విని అమందానంద మనుభవించుట కన్నులార చూచిన హరి పండితున కాశ్చర్యము కలిగింది. అవును ఏకనాథు డొక్కడే వేయిమంది విద్వాంసులకు సమానము. ఇప్పటివరకు హరి తనకు నచ్చిన మూఢాచారములను బట్టుకొని వ్రేలాడుతున్నాడు. ఇప్పుడు తనకున్న విజ్ఞానము సంకుచిత మైన దని గ్రహించినాడు. సంకు చిత మనస్తత్వము కలవాడు మోక్ష విద్య నెట్లు సాధింపగలడు? ఈ వివేకోదయము కాగానే, అతనిలోని అజ్ఞానపు చీకటులు పటాపంచ లైనవి. తోడనే హరి పండితుడు విగత మత్సరుడైనాడు. ఈ వివేకపు తుఫాను ధాటికి తన అహంకార వటవిటపి కూకటి వ్రేళ్ళతో కూలి పోయింది. తనలో వెలిగిన జ్ఞానరేఖకు తానే అవశుడై క్షణ మాల సింపకుండ హరి తన తండ్రి ఏకనాథుని పాదాలకు మోకరిల్లి పశ్చా త్తాపమును ప్రకటించినాడు.

అట్లు పశ్చాత్తప్త హృదయంతో తన పాదాలకడ మోకరిల్లి యున్న కుమారు నాశీర్వదించి ప్రేమతో "నాయనా ! లేచి నిలబడు. నీవు సర్వశాస్త్ర సముచ్చయమూ సమగ్రంగా అధ్యయనం చేసినా నమ్రత నీ కలవడలేదు. దానికై నీవు యత్నించపనూ లేదు. అందు వల్ల ఎంతగా చదువుకొన్నా, ఆ ప్రసన్నత - ప్రపన్నత లేకపోవుట వల్ల సరిగా సవ్యముగా నీవు అధ్యయనం చేసిన పురాణాలను సమ న్వయించి వ్యాఖ్యానించలేకపోతున్నావు. నీ బుద్ధి జాతి మంచిదే. అందులో ఏ సందేహమూ లేదు. ఇక మీద భక్తికున్న విలువ యెంతటిదో, ఏలాటిదో, నీవే గుర్తింపగలవు" అన్నాడు. హరి పండితు డిది అంతయు తెలిసికొని ప్రాధేయ పడుతూ ఇట్లు పలికినాడు ఓ తండ్రీ ! నా తెలియని తనానికి క్షమించు నా అవివేకం నేటితో పటాపంచలైంది. ఇక మీదట మీరు యథాపూర్వంగా పురాణాలు, శాస్త్రాలు మీ కభిమతమైన ఫణితిలో చదవటం మొదలు పెట్టండి. ఎవరింట ఏ పదార్థం తిన్నా మరోలాగున భావించను. మీరు నన్ను హృదయపూర్వకంగా క్షమించండి.

అటు పిమ్మట ఏకనాథుని కథా ప్రవచనము పూర్వం లాగునే వేలకొలది శ్రోతలను ఆకర్షిస్తూనే ఉండేది. పురాణ శ్రోతలంతా కొన్నాళ్ళయిన తరువాత ఒక వింత దృశ్యము చూడసాగినారు. ప్రతిరోజు ఒక ఎలజవ్వని పురాణము వినుటకు వస్తూండేది. ఆమె అందాల భరిణె. ఆమె అపురూప సౌందర్యాన్ని చూచిన జనం, ఆమె శీలాన్ని గూర్చి నోటికి వచ్చినట్లు పరి పరి విధాల వ్యాఖ్యానించు కొనేవారు. ఆ యువతి మాత్రము ప్రతి దినమూ పురాణ ప్రవచన మారంభించు కాలమునకు సరిగా వచ్చి కుదురుగా కూర్చునేది. పురాణము ముగిసిన పిమ్మట శాంతి ప్రవచనం చెప్పగానే వెళ్ళి పోతూండేది. కాని జనానికి ఆమె ఎవరో, ఎక్కడ నుండి వస్తున్నదో లేశ మాత్రము తెలీదు. ఆమె వర్చస్సు శాంత కమనీయంగాను,

ఎంతో హుందాగాను కనిపించేది. ఆమె నోటి నుండి ఎప్పైనా ఒక మాట వెలువడితే, ఎవరితో మాట్లాడినా సరే ఎంతో మాధుర్యం జాలు వారేది. అలా నడుస్తున్నాయి రోజులు. అట్లుండగా ఒకా నొకరోజు రాత్రి, పురాణానికి వచ్చిన వారిలో కొందరు పురాణ ప్రవచనము ముగిసిన పిమ్మట, ఆమెకు తెలియకుండా వెంబడించినారు. ఆ సౌందర్యరాశి కొండచరియల నుండి క్రింది క్రిందికి దిగి ఒక కోన చీకటిలో అకస్మాత్తుగా మటు మాయమైపోయింది. నదీ - చీకటి ఒక దాని నొకటి వేరు చేయలేనంతగా అలుముకుపోయినాయి.

ఆ మరునాటి సాయంకాలం మామూలుగా ఆ యువతి పురా ణం వినటానికి రాగానే ఆమెను చూచి ఏకనాథు డిట్లడిగినాడు. "ఏమమ్మా ! నిన్న సాయంత్రము నీవు మరలి వెళ్ళేటప్పుడు ఎవరూ నిన్ను ఇబ్బంది పెట్టలేదు కదా! ఈ సాయంకాలము నీతో ఎవరి నైనా రక్షణ కొరకు పంపమంటావా ?" ఆ మాటలు విని ఆమె ఒక చిరునవ్వు నవ్వి మధుర స్వరంతో సమాధానము చెప్పింది. "స్వామీ ! మీరేమీ యిబ్బంది పడకండి. తాము నాపై చూపే కటాక్షమే నాకు పదివేలు. అదే నాకు శ్రీరామరక్ష"

ఆ తరువాత కొంతకాలానికి ఆమె గోదావరీమాతయే కాని మరొకరు కాదని ప్రజ లర్థము చేసికొన్నారు. అన్ని రోజులూ క్రమం తప్పకుండా సకాలానికి పురాణ శ్రవణమునకు వచ్చినది ఆమెయే కాని వేరొకరు కాదని ప్రజలంతా నిర్ణయించుకొన్నారు.

ఒక రోజున పెనుతుఫాను ఘళ ఘళార్భటులతో ప్రళయ భీక రంగా వీస్తుండగా, ఆ గ్రామస్థు లొక వృద్ధ బ్రాహ్మణుని ఏకనాథుని కడకు పొమ్మని బలవంతపెట్టి త్రోసినారు. ఆ బాటసారి కుంభ వృష్టిలో చిక్కుకొని తడిసి ముద్దయి ఏకనాథుడున్న యింటి కేతెంచి నాడు. ఆ అభ్యాగతుని స్థితి గమనించి ఏకనాథుడు వానికి చలి కాచు

కొనుట్కై వంట వేయించి, కట్టుబట్ట లారేలాగున చూడవలసినదిగా సేవకున కాజ్ఞాపించినాడు. పాపం ఏకనాథుని అర్ధాంగి గిరిజాబాయి తన యింటిని పరికిస్తే తన కట్టెలన్నీ వర్షానికి బాగా తడిసిపోయినాయి. ఆమె ఎంత శ్రమపడినా పొయ్యి రాజుకోవటం కష్టమయింది.

ఈ పరిస్థితిని ఏకనాథుడు గమనించి ఏ సంకోచమూ లేకుండా ఉద్ధవునకు తన పై పంచ నీయుగా అదే పొయ్యి మండటానికి ఇంధన మయినది. ఏది ఏమయినా యిల్లు వెదకుకొని వచ్చిన వాని కాతిథ్య మిచ్చుటే ఆతనికి ప్రథమ కర్తవ్యము. ఎట్లో ప్రయాసపడి ఎట్టకేలకు గిరిజాబాయి వంట చేసింది. ఆ వచ్చిన ముసలి బ్రాహ్మణుడు ఆహార పానీయాదులతో ఎంతో సంతృప్తి పడినాడు. అతిథి సమర్చనము ఏకనాథుడు జీవిత మంతా ప్రధాన ధర్మముగా పాటించినవాడు ఆతని మనస్సులో వీసమంత కూడ స్వార్థములేదు. ఆయన గుండె భూత దయతో ఆర్ద్రమైంది. ఆ దయ ఎన్నో అద్భుతాలు చేసింది. ఏకదాథుని మనస్తత్వ విశ్లేషణకు కుమారుడైన హరిపండితునిపై చేసిన ప్రయోగమే మహత్తర నిదర్శనము.

ఒక పర్యాయము అనాథ శిశువులో విశ్వాసమును ప్రేరేచుటకై, ఆతనితో ఏకనాథు డుపవాస మొనర్చినాడు. మరొక మారు ఆతనితోనే తిండి తిని, ఆతనితో తాను కూడ ఔషధసేవ చేసినాడు ఇంకొక పర్యాయము ఒక దరిద్రురాలి సంతతికి తీయని తినుబండారములు చేయించి పెట్టి తానెంతో ఆనందకందళితుడైనాడు. ఆ నిరుపేద పిల్లవాడు తానై కొన్ని తినలేడు. ఆతని పేదరిక మంత టిది. ఆ కుర్రవానిని రోగ విముక్తుని జేసి, అనంతర కాలమున ఆతనినే పరమాదరముతో శిష్యునిగా స్వీకరించినాడు. ఆతని పేరే గవాబా. కాలాంతరంలో ఆ శిష్యుడు ఏకనాథు డసంపూర్ణముగా వదలిన రామాయణాన్ని పూరించినాడు.

శత్త్వముతో దైవ సంకీర్తనలు పాడుకొంటూండగా, ఎట్లో ముగ్గురు దొంగలా యింటి యావరణలో ప్రవేశించినారు. మామూలుగా ఏకనాథుడు సంకీర్తనం చేసిన తర్వాత. ఇంట్లో అందరూ గుర్రుపెట్టి నిద్రాపరవశులైనారు. ఇదే మంచి అదనుగా తలంచి దొంగలు ముప్పైరూ చడీచప్పుడూ లేకుండా గదిలో దూరి అందులో పదిలంగా పరచబడియున్న పాత్ర సామగ్రిని, ఇతర వస్తువులను చల్లగా సంగ్ర హించి ఒక తలుపు చాటునకు చేర్చినారు. అంతతో వారికి తృప్తి కలుగక ఇంకా ఏమైనా దొరుకునేమో అని మళ్ళీ యింటి లోపలికి పోయినారు. అంతే. ఆ దొంగలంతా ఘోర ప్రమాదానికి లోనయి నారు. ఒకరి తర్వాత ఒకరు ముగ్గురు కూడా అంధులయినారు వారికి త్రోవ యేదీ కానరాలేదు. వారున్న చోటనే దొంగలు తడుములాడుకో సాగినారు. అట్లు తడుముకొనుచు పోగా చిట్టచివరకు వారంతా తాము తలుపు చాటున చేరవేసికొన్న దొంగ సామాన్లపై అనుకోకుండా పడగా ఇంట్లో పెద్ద చప్పుడయింది. ఏమిటీ చప్పుడని ఏకనాథుడు లేచి ఏమి జరిగిందో అని ఆ తలుపు దగ్గరకు వచ్చి చూస్తే ఇదీ కథ !! దాగొని యున్న దొంగలు ముప్పైరూ ఏకనాథుని పాద ముల సవ్వడి విని ఒక సాధు వింటిలో దొంగతనము చేయుటకు వచ్చినామే అని బాధపడి, అందుకే తాము గ్రుడ్డివాళ్ళ మయ్యా మనుకొన్నారు అయినా ఎట్లో తప్పించుకొని పోవాలని ఆరాట పడ్డారు.

ఏకనాథుడా దొంగలు ముగ్గురినీ పిలిచి ఎందుకింతగా మీరు భయపడుతున్నారని అడిగినాడు. ఆ మాటలు విన్నదే తడవుగా ముగ్గురు దొంగలూ స్వామివారి పాదాలపై సాష్టాంగపడి, తాము అంధులమైన ఉదంతాన్ని విన్నవించుకొన్నారు. వారి మొర విని ఏకనాథస్వామి కరుణాంతరంగుడై ఆ దొంగల కనుబొమలను తానే

స్వయముగా నిమిరినాడు. వారి గ్రుడ్డితనము మటుమాయమైంది. పూర్వంలాగే వారికి చూపు వచ్చింది. ఏకనాథస్వామి అంతటితో ఊరుకోక, అర్ధాంగి గిరిజాబాయిని, సేవకుడు ఉద్ధవుని పిలిచి ఆ దొంగలకు కడుపునిండా భోజనము పెట్టించినాడు. అంత మాత్రమే కాదు. ఆ దొంగలు తలుపుచాటునకు చేరవేసికొన్న పాత్రసామగ్రిని యావత్తూ పట్టుకు పొమ్మన్నాడు. ఆ దయా వీరుని మంచితనమునకు వారు ఉబ్బితబ్బిబ్బయి మళ్ళీ స్వామివారి పాదములపై వ్రాలి ఇక తా మెప్పుడూ దొంగతనం చేయమని మనస్సాక్షిగా ప్రమాణము చేసినారు. ఆ చోరుల హృదయ పరివర్తనకు స్వామి సంతసించి వారి నాశీర్వదిస్తూ 'మీ రూపంలో దైవమే నా యింటికి వచ్చినాడు. ఇక మీరు వెళ్ళవచ్చు. ఈ పాత్రలను తీసుకొని పొండి ! న్యాయ మార్గంలో జీవితాలను గడుపుకోండి' అన్నాడు. ఏకనాథుని న్యాయ దృష్టి జీవిత మంతా అట్లే సాగింది. ఎంతో మంది బ్రాహ్మణులు ఏకనాథునిపై లేనిపోని అభాండాలు వేసినా - అవరోధా లెన్నో కల్పించినా ఆతని భూతదయ, న్యాయ వర్తనము ఏ మాత్రమూ చెక్కుచెదరలేదు.

హరిజనోద్ధరణ :

చరమ వయస్సులో ఏకనాథుడు ఒక హరిజన బాలుని చేరదీసిన ఉదంతము గుర్తింపదగింది. ఒక హరిజన స్త్రీ నీటికోసము నదీ తీరానికి వచ్చి, పని తొందరలో ఇసుక తిన్నెలపై ఆడుకొంటున్న తన కుమారుని మరచి యింటికి వెళ్ళిపోయింది. ఆ కుర్రవాడు ఏడుస్తూ ఆ తిప్పలోనే ఉండిపోయినాడు. ఈ దృశ్యమును చూచిన ఏకనాథుడు ఆ పిల్లవానిని చంకకెత్తుకొని, తల్లికప్పగించి, తర్వాతనే తన స్నాన సంధ్యాది కృత్యాలను నిర్వర్తించుకొన్నాడు. ఈ చిఱుసంఘటన, ఏకనాథుని కులమువారిలో పెద్ద సంచలనం కలిగించింది. పరమ పవిత్ర

మైన భానుదాసుని వంశంలో మాయని మచ్చ ఏర్పడిందనీ, ఏక
నాథుని చర్యను నిరసిస్తూ తోడి బ్రాహ్మణులంతా నిందించారు.
అంతటితో ఊరుకోలేదు. పైఠాను నగరమందలి బ్రాహ్మణ్యమంతా
సమావేశమయి ఏకనాథుని పవిత్రీకరించుటకు ప్రాయశ్చిత్త
కాండ జరుపవలెనని నిర్ణయించారు. కాని ఆ నిర్ణయాన్ని ఏక
నాథుడు దృఢచిత్తంతో తిరస్కరించినాడు. తన కే విధమయిన ప్రాయ
శ్చిత్తవిధి అక్కరలేదని నిష్కర్షగా వచ్చినవారితో చెప్పినాడు,
బ్రాహ్మణులు పట్టుదల కొంత సడలింది. కనీసం గోదావరిలో
స్నానం చేస్తే చాలునని పట్టు పట్టినారు. దానికీ అంగీకరింపలేదు.
ఏదో నెపంతో ఏకనాథునకు ఊరివారంతా మరణ దండన విధించాల
న్నంత వరకూ పోయి ఆ విధంగా నిర్ణయించినారు.

ఈ కఠోర నిర్ణయం చేసినందులకు బాధపడుతూ, ఏకనాథుడు
గోదావరి నదిలో దిగి, ఊరివారిని సంతోష పెట్టుటకై స్నానము
చేసి ఆ నదీ తీరములోనే జపతపములు నిర్వర్తింపగడగినాడు. ఈ
లోగా కుష్ఠువ్యాధి బాధితుడైన మనుజుడొకడు హఠాత్తుగా దూసు
కొనుచు వచ్చి, రొప్పుతూ రోజుతూ ఏకనాథుని వైపునకు తిరిగి
సాష్టాంగపడి యిట్లన్నాడు. "స్వామీ! నేను పన్నెండేండ్ల నుండి
ఈ దుష్ట కుష్ఠువ్యాధితో యమయాతన లనుభవిస్తున్నాను. ఇట్లుంటూ
త్ర్యంబకేశ్వరములో నేను ఘోర తపస్సు నారంభించాను. అప్పుడు
నా కొక కల వచ్చింది. ఆ కలలో పైఠాను నగరమందున్న ఏకనాథ
స్వామి హరిజన బాలుని సంరక్షించిన పుణ్యము ధారపోసినచో
తనకు ఈ దుర్భర వ్యాధి నివారణ మగునని ఒకమాట వినిపించినది."

ఏకనాథస్వామి దరహాసంతో ఎంతో వినమ్రతతో ఆ రోగిని
చూచి 'నేను పుణ్యమూ ఎరుగను. పాపమూ ఎరుగను కాని నీకు
ఉపకరించినట్లయితే ఆ పుణ్యము నీ చేతులలో ధారపోయుటకు

నా కేట్టి అభ్యంతరమూ లేదు. అందుకు నేను సిద్ధంగా ఉన్నాను. ఏదైనా సుకృతలేశము వల్ల నీ భయంకరవ్యాధి పోవునన్నచో, అంతకంటె నా కానందించ దగిన దేముంటుంది?' అన్నాడు. అట్లన్న మరుక్షణమే ఏకనాథుడు ఆ రోగి చేతిలో సమర్పణ బుద్ధితో తనచేయి వేసినాడు. పరమాద్భుతముగా ఆ దుర్భర కుష్ఠువ్యాధిగ్రస్తుడు పరిపూర్ణారోగ్యవంతుడయినాడు. ఆతని సంతోషానికి మేర లేదు. ఈ సంఘటనను చూచి ఊరిలోని బ్రాహ్మణులందరూ అవమాన భారంతో తలలు వంచుకొని, పల్లెత్తు మాటయినా ఏకనాథుని అన కుండ ఎవరి యిండ్లకు వారు సిగ్గుపడుతూ వెళ్ళిపోయినారు. ఇవన్నీ చూస్తే, ఏకనాథుని జీవిత మంతా అంతశ్శుద్ధికీ - అంతస్సౌందర్యము నకూ సజీవోదాహరణమే. ఆ మహనీయుని మాటలు, చేతలు ఒకే త్రోవలో నడచినాయి. ఇరుగు పొరుగు వారితో ఆతని వర్త నము - జరిగిన సంఘటనలు ఈ విషయమునే వేయి విధాల చాటు తున్నాయి. ఏకనాథుని విశ్వప్రేమ, శరణాగతి, నమ్రత, విజ్ఞత, నిజాయితీ అన్ని సన్నివేశములలోను ఒకే లాగున నున్నవి. ఆయన ఎప్పుడూ పరిస్థితులతో రాజీపడి ఆదర్శములను జార విడువలేదు. ఆతడున్న కాలములోనే మానవాతీతునిగా ఆయనను లోకోత్తరు నిగా సంభావించారు.

ఏకనాథుని మధురగేయములు నిత్యజీవలక్షణముతో పరుగులు పెడతాయి. ఆయన కవితాఖండములు నిరంతరమూ తళతళ మెరిసే అపూర్వ రత్నాలు. ఆ కవితలన్నీ ఆనందపు టంచులు తాకించునట్టివే. శమ దమ సంపన్నుడైన ఏకనాథుడు హృదయతః మహాభక్తాగ్రేస రుడు. ప్రేమైకమూర్తి. విశ్వప్రేమ తరంగాలలో ఈదులాడే నిత్య సంతోషి. సకల సద్గుణ సంపన్నుడైన ఏకనాథుడు ఉత్తమోత్తమ భక్తుడు, మహాజ్ఞాని. భవ్య కవితావేశముగల మహాకవి. స్వయం కల్పితమైన నియమ నిబంధనలకు లోబడి మానవతా పారమ్యముతో త్యాగమయ జీవితమును గడపిన మహానుభావుడు.

చూపినదేగాని అన్యముకాదు.

మనసునకు నియమితమైన కర్మను చక్కగా నిర్వహిస్తే, అది మన స్సును పవిత్రము చేస్తుంది. అదే భక్తికి వాస్తవమైన అర్హత. బంధాతీతుడుగా - ద్వంద్వాతీతుడుగా మానవుడు వ్యవహరించే టంత వరకూ, వేదనిబద్ధకర్మలను సమాచరింపవలసిందే. అది యెట్లన, ఒక మామిడిచెట్టును కాపలాకాసేవాడు, ఆచెట్టు నున్న కాయలు పక్వమై కోసేటంతవరకు కాపలా కాస్తూనే ఉంటాడు. ఇదికూడ అట్టిదే. కాయ లన్నీ కోసివేసిన తర్వాత చెట్టుకు కాపలా మానివేయవచ్చు. అందుచే వ్యక్తి బంధాతీతు డయ్యేటంతవరకూ విహితకర్మ లాచరించి తీరవలసిందే. ఎవడయినా బాహ్య శరీర సంస్కృతిని వీడితే ఆయన నిజంగా వేదాతీతుడే.

భగవన్నామమును నిరంతరము జపించుట, ఆ జగద్విభుని నిరంతరము జ్ఞాపకము చేసికొనుట కే. దైవసాన్నిధ్యమును పొందుట యోగసాధనద్వారాగాని తపస్సాధనద్వారాగాని కష్టతరమైన పని. అదే సంకీర్తనంద్వారా అయినట్టయితే, దైవము మనముందు సాక్షా త్కరించి నృత్యము చేస్తాడు. కావున ఒక మహానందాతిరేకంతో ఆ మహాదేవుని కీర్తించుట నృత్యము చేయుట జరగాలి. ఇతరులనుండి ఏదీ తా నాసింపకూడదు. సాధుసత్తములు భగవన్ముద్ర హృదయానికి హత్తుకొనేటట్లు సంకీర్తనంచేసి సమాజమును ప్రభావితం చేయాలి.

ఈ జగత్తులో జీవించి యుండగానే, దైవదర్శనమును సాధించ గలగాలి. అందుకు ఏకనాథు డొక చక్కని నిదర్శనమును వివరించి నాడు. ఏకాంత సమాధి స్థితిలో భగవంతుని తొలుత దర్శింప గల గాలి. లోకంలో ద్వంద్వాలున్నచోట దయ్యములు కూడ నున్నట్లే. ఎవరేనా ఒక అమ్మాయికి పెళ్ళిచూపులు చూచుటకై కాబోయే

మగడు, ఆతని బంధువులు వస్తే, ఆ కన్య ఏ కిటికీ చాటునో నిలువబడి తన ప్రీతిని ఆదరాన్ని ప్రకటిస్తుంది, తా నొంటరి నన్నట్లుగా. అటు పిమ్మట ఆమె తన తల్లికి బియ్యం విసరుటలో సాయపడుతుంది. అట్లా పిండి విసురుతుంటే గాజులు సహజంగా చప్పుడు చేస్తాయి. అటు ఇటు వేగంగా కదలుతాయి. ఈ చర్యవలన, వచ్చిన చుట్టము లకు తాము పేదవారమని తెలుస్తుందేమోనని నెమ్మది నెమ్మదిగా ఒక్కొక్క గాజును చేతినుండి తొలగిస్తుంది. కాని ఒకటి మాత్రం ఆ అమ్మాయి ఉంచుకొంటుంది. అటుతర్వాత తన పని తాను స్వేచ్ఛగా చేసుకొని పోతుంది. ఇతరులకు ఏ విధమైన విక్షేపము కలుగనీయదు. అట్లే ఏకాంతంలో మాత్రమే భక్తు డెవడైనా తన హృదయ సమర్పణం చేసి భగవంతుని సందర్శించగలుగుతాడు.

లోకమున అపార క్షమాగుణముగల మహా భక్తులెవరైనా ఉంటే, ఆయన ఒక్క ఏకనాథుడే. ఆయన ఒక్క తప్పు మాత్రము ఎప్పుడూ ఎప్పుడూ చేయకూడ దన్నాడు. ఇతరులలో దోషములను చూచుట, ఆ దోషములతో తాను ప్రమేయమును కల్పించుకొనుట తప్పులలో కెల్ల తప్పుగా భావించినాడు. నిజ మాలోచిస్తే, మనలోని పాపములను - తప్పులనే ఇతరులలోనూ చూస్తాము. ఆ తప్పులు మనకు ప్రతిబింబములే కాని యితరులలోనివి మాత్రము కానేరవు. అందుచేత ఎవడైనా ఇతరులపై క్రోధ, ద్వేషములను చూపటంలో అర్థం కనబడదు. నీ నాలుకను నీవే కరుచుకొంటే, ఎవరిమీద ఆగ్రహిస్తావు ? ఎవనిపై కక్ష తీర్చుకుంటావు ? లోకంలో కొంత మంది తాము కుపితులైనందులకు కారణములను ఏకరువు పెడు తుంటారు. లోకంలో ఎవడైనా కాలు జారిపడినాడనుకుందాము. ఆత డెవరిని నిందిస్తాడు ? ఎవ్వరినీ నిందించడు. పడినచోటునుంచి ఏలాగో తానే లేస్తాడు. అవమానితుడైనట్లు భావిస్తాడు. ఆ పిమ్మట తన కేమీ జరగనట్లుగా తన దారిని తాను పోతాడు. ఇతరు లెన్ని

నిందలు తనపై మోపినా, సహనంతో కోపం లేకుండా ఎవడు భరిస్తాడో అంతరంగంలో కూడ బాధ నొందడో వాడే మహా యోగి. మహర్షి. విశ్వాత్మ భావన అట్టివారిలో ఉండుటయే అందుకు ప్రధాన హేతువు.

ఆధ్యాత్మిక జిజ్ఞాసువులు - ముముక్షువులు - కాంతా కనకములను సంపూర్ణంగా వదలాలని ఏకనాథస్వామి ఉద్బోధించినాడు. కాంతా కనకాలతోడి అనుబంధములను వీడని వాడెవ్వడైనా, ప్రాపంచిక సుఖములనుండి వేరుపడి, ఎట్లు ఉన్నత గతికి చేరుకోగలడు ? అంతమాత్రమే కాదు. తాను కామమునే ఆరాధిస్తూ అందులో అతివేలంగా మునిగి తేలుతున్నవారితో సహవాసాన్ని బుద్ధి పూర్వకంగా పరిహరించుకోవాలి. సాత్త్విక సంపదగల స్త్రీతో నైనను చనువుగా మాటలాడి కలసియుండుట బ్రహ్మజ్ఞానము పొందవలెనని కోరుకొనేవాడు వీడవలెను. ఒకవేళ ఆమె సహానువర్తిగా - ధర్మబద్ధురాలుగా నుండవచ్చు గాక ! చంచలమైన మనః ప్రవృత్తి యెటు పోవునో ! భగవద్విషయక రతియందు మగ్నుడైన మానవునిలో ఒక్క క్షణకాలము కాంతా ప్రలోభ వశుడైనా అది అధః పతనమునకే త్రోవ. కావున మనుజుడు అత్యల్ప విషయములందు సైతము రక్తిని విడనాడిననాడే దైవానుభూతి పొందుట కర్హుడగును.

ఆధ్యాత్మికాభ్యుదయమునకు పెద్ద ఆటంకాలు కాంతాకనకములనుట మనమెప్పుడును మరువరాదు. పరమ గురువుల ఆదేశములు- ఆచరణములే మనకు మార్గ దీపికలని గుర్తునందుంచుకొనవలెను. ప్రపంచమే ఒక ఆధ్యాత్మిక పాఠశాల. ఎందరెందరో మహా ప్రవక్తలు లోకమున అవతరించినారు. అవతరిస్తారు కూడ. అట్టి మహా భక్తుల - యోగ నిరూపణలను గూర్చి అధ్యయనం చేయుటయే మన మంతా చేయవలసిన పని. గాఢమైన దీక్ష వీని అన్నింటికి మూలము

ఆధారపీఠము. మహారాష్ట్ర సాధు పుంగవు లెందరో ఏక కంఠంగా భక్తి మార్గ మొక్కటే సర్వజన సుగమమైన మార్గమని ప్రబోధించినారు.

ప్రేమతత్త్వము కారణంగానే భక్తుడు కైవల్యమును సాధింప గలడు. ఆ పరమేశ్వరుడు మహా సాగర సదృశుడు. భక్తులే అందలి తరంగములు. భక్తియే మాత్రము లేని విద్యావంతుడు తరచు తరచు నగలను మార్చే భోగ స్త్రీ వంటివాడు. శరీరమును ఉపవాసాది క్లేశములతో తపింపజేయుట నిరర్థకమని ఏకనాథు డెన్నో పర్యాయములు తెల్పినాడు. మనయొక్క మనస్సు ప్రాపంచిక విషయములలో మునిగి తేలుతున్నంతకాలము, ఉపవాసములుగాని, వ్రతములుగాని ఏమీ చేయజాలవు. శరీరమును ఉపవాసాది క్లేశములకు లోను చేయుట ఏ మాత్రమూ తపస్సు కాదు. ఎంతకాలము మానవుని అంతరంగంలో దురుద్దేశాలు నిలద్రొక్కుకొని యుంటాయో అంత కాలమూ బాహిర కర్మకలాపా లన్నీ కేవలం నిష్ప్రయోజనాలే. వేదాంత పర్వత శిఖరాన్ని అధిరోహించిన మహానుభావుడు ఏకనాథుడు.

'నేనే గాయకుడను. నేనే శ్రోతను. ఓ జగద్విభూ! నేనే పాటను' అను ఏకనాథస్వామి సంకీర్తనపాదములు నిత్య స్మరణీయములు. అవే లోకము ఎప్పుడు గుర్తుంచుకోవాలి.



# యాజ్ఞవల్క్య మహర్షి

మహాజ్ఞానియైన జనక మహారాజు కాలములో నున్న ఋషు లలో యాజ్ఞవల్క్యుడు తొలుత గణింపదగినవాడు. లోకంలో ప్రసిద్ధమైన బృహదారణ్యకోపనిషత్తునకు ఈతడే కర్త. ఉపనిషత్ సముచ్చయానికది తలమానికం లాంటిది.

యాజ్ఞవల్క్యుని తండ్రి బ్రహ్మరాతుడు. ఆ బ్రహ్మరాత మహర్షి సంతానము కోసమై పన్నెండేండ్లు పరమశివుని గూర్చి కఠోర దీక్షతో తప మొనరించినాడు. అంతట పరముడైన మహే శ్వరు డాయనకు ప్రత్యక్ష మైనాడు. ఆ మహాదేవుని తన కొక పుత్రుని అనుగ్రహింపవలసినదని, ఆ పుట్టిన బిడ్డడు తన జ్ఞాన కర్మల ద్వారా మీ అనుగ్రహాన్ని సంపాదింపగలిగినవాడై యుండాలని, బ్రహ్మ విద్యను లోక మంతటా చాటేవాడు కావాలని కోరినాడు. మహా దేవుడు బ్రహ్మరాతుని కోరికను సాంతము విని, ఆ మహర్షితో నన్ను గూర్చి వర్ణించుట కెవ్వడును చాలడు. అందువలన నేనే మీ దంప తులకు సంతానముగా పుట్టగలను. ఇప్పటివరకును లోక మెఱుగని వేదమును వెలువరింపగలనని వర మొసంగి, అదృశ్యమైనాడు. కాల క్రమంలో బ్రహ్మరాతుని భార్య 'సునంద' గర్భవతియై ఒక పుత్రుని కన్నది. ఆ బిడ్డయే యాజ్ఞవల్క్య మహర్షి.

యాజ్ఞవల్క్యుడు విధివిహితంగా సముచిత వయస్సులో ఉప నీతుడై నాలుగు వేదాలను నలుగురు గురువుల ముఖతః నేర్చుకొని ఆరితేరినాడు. ప్రధానంగా యజుర్వేదమును తన మేనమామ వైశం పాయన మహర్షి దగ్గర అధ్యయనము చేసినాడు. ఋగ్వేద విద్యలో అత్యంత ప్రసిద్ధి గాంచిన ఆశ్వలాయన మహర్షి తన కూతురు కాత్యాయని నిచ్చి యాజ్ఞవల్క్యునకు వివాహము చేయించినాడు.

ములు ఆ నోట ఆ నోట విని సమాకర్షితురాలై మైత్రేయి (ఋషి మిత్రుని కుమార్తె) ఆతని వద్ద బ్రహ్మవిద్య నేర్వవలెనని తలంచినది. ఆమె ఎల జవ్వని. తాను ఆ మహర్షి శిష్యురాలుగా అక్కడకు వెళ్ళినచో తన్ను లోక మపార్థము చేసుకొనునేమో అని ఆమెకు శంక! పైగా లోకము, తన కేవో దురుద్దేశముల నంట గట్టుటకును సాహసింపవచ్చును అని భావించుకొన్నది. ఈ చిక్కులన్నీ తొలగుటకై ఆ యాజ్ఞవల్క్య మహర్షినే పరిణయ మాడ దలచుకొన్నది. అట్లగుచో లోకము తనను వేలెత్తి చూపదు. ఈ విషయమై తండ్రియైన మిత్ర మహర్షి వాకబు చేయుగా, అప్పటికే యాజ్ఞవల్క్యుడు కాత్యాయనిని వివాహ మాడినట్లు, మరియొకతె నాతడు వివాహ మాడడని తెలిసినది. ఈ ఉదంతము మైత్రేయి చెవిని పడినది. ఒకనా డామె తండ్రితో 'మీరు చెప్పినది బాగున్నది. ఆ మహర్షి శరీరంపై కాత్యాయనికే సర్వహక్కు లున్నవి. ఆయన తనువు కాత్యాయని సొత్తు. నేను దానిని కాదనను. అయితే ఒక్కమాట! ఆ మహర్షిని వివాహ మాడుటకు ఆ కాత్యాయనియే అంగీకరిస్తేనో' అన్నది. ఈ తలంపు మనసులో మసలగానే మైత్రేయి, కాత్యాయని యున్న తావునకు పోయి ఆమెతో ఇట్లు పలికినది. 'ఓ కాత్యాయినీ దేవీ! మరొకలా నీ వనుకోనంటే ఒక్కమాట చెప్పడానికి వచ్చాను విను. నీ భర్త యాజ్ఞవల్క్య మహర్షి శరీరముపై నాకు లేశమాత్రమూ అపేక్ష లేదు. కాని నన్ను నేను రక్షించుకొనుటకును, లోకనిందను పరిహరించుకొనుటకును నే నాతని వివాహమాడ దలచినాను. అయితే ఒక్కమాట నీ భర్త శరీరాన్ని అనుభవించటానికి అపేక్షించే అవినీతి పరురాలను మాత్రము కాను, కా లేను. లోకమున ఇంతకుముం దెవ్వరు అడుగుటకైన నొల్లని సాహసోపేతమైన వరము నిన్నడుగుచున్నాను. అది ఆ ఋషితో వివాహము. ఓ దేవీ! నా కా వరము ననుగ్రహింపగలవా? అన్నది. ఈ వివాహములో మైత్రేయి ఆంతర్యము బ్రహ్మవిద్యా సము

ు, సూక్ష్మగ్రాహియైన కాత్యాయని గ్రహించి, మైత్రేయి
కరించినది. దానితో కాత్యాయని కీర్తి మిన్ను

ాన పురాధినాయకుడు 'సుప్రియ' మహారాజు. ఆయనకు
ంపాయన మహర్షి. ఆ మహారాజు బహుకాలము నుండి
ధితో సతమత మగుచున్నాడు. అది యెరిగి వైశంపాయ
ివారణమునకై అనుదినమూ మంత్రపూతమైన పవిత్ర
ు పంపుచుండువాడు. ఆ మహర్షికి తన ప్రియ శిష్యుడైన
్యుని రాజదర్శనానికి పంపి, రాజాభిమానము చూరగొను
ెనని తీవ్రంగా కుతూహల పడినాడు. శిష్యుడా మహా
ఏదో ఒక నెపాన శిష్యుని ప్రభువు కడకు పంపవలె నని
. ఆతనిపై కొండంత ఆశ పెట్టుకున్నాడు. ఒకనా
ిష్యుడైన యాజ్ఞవల్క్యుని పిలిపించి, తాను అనుదినము
ోదకమును సుప్రియ మహారాజున కందీయవలసినదిగా
గురువు ఉబలాట పడెనే కాని, శిష్యుడైన యాజ్ఞ
ుమంతయు ఉత్సాహము చూపలేదు సరికదా, తనలో
ువు గొణుగుకొన్నాడు. తన గురువు రాజుగారి రోగ
త్త మెందు కింతగా ఆరాటపడుచున్నాడో ఆతని కర్థము
ి మాలోచిస్తే ఆ మహారాజు తన కర్మ ఫలితమునే
ా అనుభవిస్తున్నాడు. గురువుగా రెందు కింతగా రాజు
ొలగించటానికి ఆరాట పడుతున్నట్లు ? ఏది యేమైనా
దేశము త్రోసివేయరానిది. కావున ఒడంబడి పవిత్ర
మహారాజు సన్నిధికి గొనిపోయినాడు. యాజ్ఞవల్క్యుడు
ములోనికి ప్రవేశించుచుండగా ఆ సమీపము నందున్న
ా కుర్ర శిష్యుని గాంచి వికటంగా నవ్వుతూ, గురువు
దకము రాజుగారి వ్యాధిని నయము చేయలేదు సరికదా

వాస్తవానికి హెచ్చింపజేసినదని అన్నారు. యువకుడైన యాజ్ఞవల్క్యుడు వారి వింత నవ్వులను, అంటున్న మాటలను గమనించి కూడా రాజుగారున్న ప్రాంతమును చేరినాడు. శయ్యపై నున్న మహారాజు యాజ్ఞవల్క్యుని చూచినాడు కాని, ఆతనిని మన్నించి కూర్చుండు మని పలుకడాయెను. అది యటుండ తా గొని వచ్చిన ప్రసాదమును స్వీకరించుట కేని యత్నింపలేదు. ఈ సంఘటనను పరికించిన యాజ్ఞవల్క్యున కిది తీరని అవమాన మయినది. ఇక తానచట క్షణకాలము కూడ నుండ నిచ్చగింపక, తొందరగా మంత్రోచ్చాటన మొనర్చి, తా గొని వచ్చిన పవిత్రోదకమును ఆ చుట్టు ప్రక్కల చల్లి తిరిగి వచ్చుచుండగా, తొలుత అవహేళనగా పల్కిన కాంతాజనము తన్ను జూచి, మేడపై నుండియే హేళనగా నవ్వినారు. ఋషికుమారుని హృదయము కుత కుత లాడినది. శోక ప్రోక్షిన ప్రాచువలె ఆతనిలో ఆగ్రహము పెచ్చరిల్ల సాగినది. తాను తెచ్చిన జలావశేషమును తత్ సమీపమునందున్న దారు స్థంభములపై చల్లి విసుగుతో గురువును జేరుకొన్నాడు. ఈ లోపల ఒక వింత జరిగింది. తాను చల్లిన జల బిందువుల స్పర్శకు నిర్జీవ స్తంభములు కొన్ని చిగిర్చినాయి. మరికొన్ని పూచినాయి. మరి కొన్నింటికి సరిగా పక్వమునకు రాని, కొన్ని పండిన ఫలాలు ఏర్పడినాయి. ఈ విచిత్ర సంఘటన నమ్మ శక్యము గాకున్నది.

ఈ వింతను వర్ధమాన పురాధీశుడు సుప్రియ మహారాజు గ్రహించి ఆశ్చర్యపడి 'ఆ కుర్రవాడైన యాజ్ఞవల్క్యుని వెనుకకు తిరిగి రమ్మని, తనపై పవిత్ర జలాన్ని చల్లవలసినదని ఆజ్ఞాపించినాడు. అంతలో వార్తాహరు డొకడు వచ్చి వైశంపాయన మహర్షికి రాజాజ్ఞను నివేదించి వెడలినాడు. శిష్యుని తొందరపాటు చర్యకు, కోప తీవ్రతకు నొచ్చుకొని, ఆతని పురోభివృద్ధికి మరో మహత్తరావకాశ మేర్పడిన దని ఆనందించి వెంటనే మేనల్లుడైన యాజ్ఞ

వల్క్యుని మరల రాజ సన్నిధి కేగుమని కోరినాడు. ఆ మాటలు శిష్యున కెంత మాత్రమూ హితముగా తోపలేదు. అంతే కాదు అప్రియముగా కూడ తోచి, గురువు వైశంపాయన మహర్షితో 'స్వామీ! నా దొక విన్నపము. ఆ మహారాజు జరిగిన తప్పిదమునకు రవ్వంత కూడ పశ్చాత్తాపపడలేదు సరికదా, మర్యాద కొరకైనా క్షమాపణము చెప్పలేదు. కావున నే నటకు పోజాలను. ఆ రాజు చేసిన దుశ్చర్యలకూ, దుష్కర్మలకూ ఫలితమే ఆతనిని వ్యాధి రూపముగా పీడించుచున్నది. అనుభవించుటొక్కటే దానికి నిష్కృతి. సుప్రియుడు మహారాజు కావున, ఆయనకు రోగనివారణ చేయవలెనని తాము భావించినారు. ఏ కారణము వల్లనైనా రోగము బాగైనచో, మరల ఆ రాజు దుష్కర్మలను చేయుచునే యుండును. అంతే కాని దుష్కర్మలొనర్చుట మానడు' అన్నాడు. వైశంపాయనున కీ మాటలు రుచింపక, శిష్యుని అవిధేయతను సహింపజాలక, నీవు రాజు కడకు పోవుదువా లేదా అని తీవ్ర స్వరముతో గద్దించినాడు. యాజ్ఞవల్క్యుడు మాత్రము తొణకక బెణకక నిశ్చలముగా నుండి, రాజ సత్కారము, నా ఆత్మగౌరవము కంటె ఏ మాత్రమూ గొప్పది కాదనినాడు. ఆయన మహారాజు కావున మీ సమభావన విశ్లథమైనది. ససేమిరా నేను వెళ్ళనుగాక వెళ్ళ నన్నాడు. గురు వాతని మాటలకు ఆగ్రహోదగ్రుడై మండిపడి 'నీవు రాజ సన్నిధికి పోవుటకు నిరాకరించి వెళ్ళక పోయినచో, ఈ ఆశ్రమంలో నీవు ఉండుటకు వీలు లేదు. పో పొమ్ము!' అని రోషావేశంతో గర్జించినాడు.

శిష్యుడైన యాజ్ఞవల్క్యు డా మాటలు పరమ శాంతంగా విని గురువుతో మరల నిట్లన్నాడు "స్వామీ! మీ పాదములకు నా ప్రణామములు. పశ్చాత్తాప శూన్యుడైన ప్రభువుతో నాకు పనిలేదు. దోషమును గుర్తించుటకేని యత్నము కొంచమును చేయని మీకు, నేను శిష్యుడుగా నుండ జాలను". వైశంపాయనుడు ఉద్రిక్త మన

సుడై శిష్యునితో 'యాజ్ఞవల్క్యా! ఉత్తమగుణాలగురించి గురువు నైన నాకే పాఠాలు చెప్తున్నావు. నా కడ చదివినదానికి కృతజ్ఞత నీలో కనపడదు. కావున నానుండి నేర్చిన యజుర్వేదము నిన్ను వీడుగాక! వెళ్ళు! వెళ్ళి పో! కృతఘ్నుడైన శిష్యుడు ఆశ్రమం నుంచి వెళ్ళటం ఎంతైనా మంచిది' అన్నాడు.

ఈ దోషారోపణకు శిష్యుడు నిర్విణ్ణుడై, తనను తానే సంభాళించుకొని, వైశంపాయనులవారితో 'స్వామీ! మీ రనుగ్రహించిన జ్ఞానాగ్ని, లో లోపల నన్ను దహించి వేస్తున్నది. ఉష్ట్రపక్షి తాను మింగిన నిప్పును తానే కక్కినట్లు, మీరు నేర్పిన విద్య నిక్కడే యిప్పుడే కక్కి వెడుతున్నాను' అని పలికి, లౌకికానుబంధములకంటె సత్య, ధర్మము లెక్కువని గ్రహించి, యాజ్ఞవల్క్యుడు వైశంపాయన మహర్షి ఆశ్రమమును వీడి ఎటకో దూర తీరాలకు పోసాగినాడు.

కొన్ని రోజులు గడిచినాయి. ఒకరోజు యాజ్ఞవల్క్యుడు గాయత్రీ మహామాతను ఆహ్వానించి, ఇంతకు ముందు జరిగిన సంఘటనలలో ఆ దేవి సహాయము నర్థించినాడు. గాయత్రీమాత మహానంద సంభరితురాలై 'కుమారా! దుఃఖ పడకు. కష్టమూ' క్లేశమూ లేకుండా లోకంలో ఏ సాధనా ఉండదు నే చెప్పినట్లు నడుచుకో: సూర్యదేవునికడ శుక్లయజుర్వేద మున్నది. భక్తి శ్రద్ధలతో ఉపాసించి, ఆయన సాయముతో ఆ వేదము నధ్యయనము చేసి, లోకము నందు దానిని ప్రచారం చెయ్యి' అన్నది.

యాజ్ఞవల్క్యుడు సూర్యునిగూర్చి కఠోర తపస్సు చేసి మెప్పించి, ఆ దివ్యపురుషుని అనుగ్రహ విశేషమువల్ల, ఆ మహాష్ణమును తట్టుకొని ఆయనను సమీపించినాడు. ఆ సూర్యభగవానుడే యాజ్ఞవల్క్యునకు శుక్లయజుర్వేదము ననుగ్రహించినాడు. వెను

వెంట మహర్షి సూర్య మండలమునుండి భువికి దిగి వచ్చి గోదావరీ తీరమును జేరి, అక్కడ పన్నెండుగురు శిష్యులకు ఆ శుక్ల యజు ర్వేదము ననుగ్రహించినాడు. ఈశావాస్యోపనిషత్తు, ముక్తికోపని షత్తు, బృహదారణ్యకోపనిషత్తు దీనిలోనివే.

ఆ సమయంలోనే జనకమహారాజు, ఒక నిర్ణీత స్థలంలో - సమయంలో బ్రహ్మజ్ఞానుల సమావేశము జరుగగలదని నేల నాలుగు చెఱగుల చాటింపు వేయించినాడు. బ్రహ్మవాదమునందు ఉత్తీర్ణుడైన మహర్షికి వేయిగోవులు, ఒక సువర్ణ కంకణము బహూకరింతునని కూడా ప్రకటనలో నున్నది. ఇందులో జనకుని ఆంతర్యము, ఆ విజే తను తన గురువుగా ఎంపిక చేసికొనుట. ఆ సభాస్థలిలోనే విజేత యైన ఆ బ్రహ్మజ్ఞాని గోసహస్రమును గైకొనవచ్చును. ఎంతోమంది వేత్త లా సదస్సున కేతెంచిరి కాని, ఏ ఒక్కరునూ ఆ అంతస్థు తమకు కల దని చెప్ప సాహసింపరైరి. ఏ ఒక్కరూ ముందుకు రాలేదు. సభ అం తయు స్తబ్ధముగా నుండుట గమనించి, యాజ్ఞవల్క్యుడు లేచి నిలబడి సభలో తన శిష్యులకు నా వేయి గోవులను తోలుకొని వెళ్ళవలసినదన్ని ఆదేశించినాడు. రాజ రక్షకులు ఆ మహర్షిని నిశితంగా పరిశీలించి, ఆయ నతో ఈ ఆవులన్నింటిని గ్రహించుటకు మీరే సర్వోత్తములయిన బ్రహ్మ జ్ఞానులని ఏ తీరుగా భావించితి రన్నారు.

ఆ ప్రశ్నకు బదులు చెప్పుతూ యాజ్ఞవల్క్యుడు 'ఏ బ్రహ్మ జ్ఞానీకూడా తనను తాను బ్రహ్మజ్ఞాని ననుకొనడని మీ రెరుగుదురు కదా! మఱొక్కమాట. నేను బ్రహ్మజ్ఞాని నౌనో కాదో కాని, నాకీ వేయి ఆవులు అవసరం' అన్నాడు. ఇట్లా సంభాషణ జరుగుతున్న సమ యంలో పలువురు వేత్తలా చోటికేతెంచి ఆతని జ్ఞానాన్ని పరీక్షించే దృష్టితో, కొన్ని జటిలమైన ప్రశ్నలు వేయసాగిరి. ఏమీ తొట్రు పాటు పడకుండా నిదానంగా నిబ్బరంగా అన్ని ప్రశ్నలకూ సదుత్తర

ము లిచ్చినాడు. అందరు బ్రహ్మవేత్తలలోంచి 'గార్గి' లేచి 'ఈ యాజ్ఞవల్క్యుడు వచ్చిన వారవంరిలో గొప్ప బ్రహ్మజ్ఞాని' అన్నది. అయినా శాకల్యుడు మరుసుతనంతో కేవల వాదంకోసము ఏవో పూర్వ పక్షములు లేవనెత్తినాడు. అది గ్రహించి తానిక పూర్వ పక్షము చేయుదునని, ఒక వేళ శాకల్యుడీ వాద వివాదాలలో ఓడి నట్లయితే, ఆతనికి శిరశ్ఛేదనం జరుగుతుందని యాజ్ఞవల్క్యు డన్నాడో లేదో ఆ క్షణంలోనే శాకల్యుని తల వేయి వ్రక్కలయినది. అప్పుడు బ్రహ్మజ్ఞానియైన యాజ్ఞవల్క్యు డాతణ్ణి పునరుజ్జీవితుణ్ణి చేసినాడు. సభావేదిక నలంకరించిన జనకమహారాజు తక్కిన విద్వాంసులు, అక్కడకు వచ్చి యాజ్ఞవల్క్యునకు 'బ్రహ్మర్షి సమ్రాట్టు' అనే బిరుదం ప్రదానం చేసి, నాటి పరిషత్తును చాలించారు.

యాజ్ఞవల్క్య మహర్షి యొక్క బ్రహ్మజ్ఞాన సంపత్తికి, ఆలోచనా సరళికి ఎలుకకు జనకు డాశ్చర్య పడినాడు కాని, గో సహస్రముపైనా, బంగారము పైనా బ్రహ్మవేత్త చూపిన కోరికను, ఆతని తొందరపాటు తనాన్ని ఎంతైనా, సరిపుచ్చుకో లేకపోయాడు. ఆ మహర్షియే 'తన స్మృతి' గ్రంథంలో ఉత్తమ జీవిత మార్గానికి సత్యము, అహింస, పవిత్రత, నమ్రత, ఉదారత, శాంతి, సహనము అత్యంతమూ ప్రధానములని పేర్కొనటం జరిగింది. అటు పిమ్మట జనక మహారాజే, శ్రీకృష్ణ భగవానుని వలె యాజ్ఞవల్క్య మహర్షి కూడ ద్విధా భూతమైన చైతన్యము కలవాడని గుర్తించి ఆ మహర్షి బ్రహ్మ సాక్షాత్కారము తిరుగు లేని దనీ, దివ్య చైతన్యము నుండి యెప్పుడునూ చలింపదనీ అయినప్పటికినీ మానవత యొక్క మంచి కొలక్కై ఒక అంశ, లోకమున అనువర్తించుట తప్పని సరియని రాజు భావించినాడు. ఆతనిలో ఏవైనా దౌర్బల్యాలంటూ ఉంటే, అవి అశాశ్వతమైన శరీర సంబంధులని గ్రహింప వలసి

జనక మహారాజు యాజ్ఞవల్క్యుని కొఱకై కబురు పంపవలె నని సంకల్పించిన నాడే, అనుకోకుండా ఒకరోజున జనకుని కడ కాతడే విచ్చేసినాడు. తనకు వేదాంతము బోధించు నిమిత్తము వేయి ఆవుల నీయబోగా, మహర్షి వాటిని తిరస్కరించినాడు. జ్ఞాన బోధకు ముందే యిది జరిగినది. ఆ మహారాజుతో మహర్షి 'ఓ మహా రాజా! లోకంలో ఎంతో మంచి రథాల పైన, నావల పైనా తీర్థ యాత్రలు చేస్తూంటారు. మరి నీవో! ఉపనిషత్తు లనే వాహనము మూలంగా ఆత్మ జ్ఞాన సంపాదనార్థము యత్నిస్తున్నావు. జీవితావసానంలో ఎక్కడకు వెళ్ళుదువో నీ వెరుగుదువా' అన్నాడు. రాజు తా నెరుగనని బదులు పల్కినాడు. అప్పుడు బ్రహ్మజ్ఞాని రాజున కిట్లు విశదీకరించినాడు. "ఆధ్యాత్మిక జ్ఞానంగల వివేకి వలె, నీవు జీవిక సాగిస్తే, నీకు పరమాత్మ ప్రాప్తి కలుగుతుంది. అయితే ఎవ్వరూ అది యిట్టిదని చెప్పలేరు. ఎవరు ఎంత చెప్పినా ఇది కాదు ఇదికాదు, అని మాత్రమే అభిభాషిస్తున్నారు. అయితే అది మేధవలన తెలియదగిన దేమాత్రము కాదు. దానికి నాశము లేదు. అట్లే సంగత్వమును దాని కుండదు. ఏ బంధములును దానికి లేవు. నీవు దాని నుండి వేరయి యున్నంత కాలము, రాగ ద్వేషములు-భయసాహసములు నీ కుంటాయి. నీవు ఆ దివ్య చైతన్యంతో ఒకటిగా ఉన్నప్పుడు, ఏ కోరిక-భయము- ఆకలి-దప్పి, భ్రాంతి ఏ మాత్రమూ నిన్ను అంటవు."

జనక మహారా జీ మాటలు విని అంతర్ముఖుడై అమితమైన ఆనందానుభవమును పొందినాడు. తన్మయుడై గురువుకు దక్షిణగా తన సామ్రాజ్యము సర్వస్వము ఇస్తా నన్నాడు. అప్పుడు యాజ్ఞవల్క్యు డిట్లుద్ఘాటించినాడు. "నేను చెప్పిన ఆ పరమ ప్రాప్యమైన స్థితి ఈ రాజరికం కంటె ఎంతో మహోన్నత మైనది! నేను నీ సామ్రాజ్యాన్ని-సంపదలను వైభవములను కోరను. నా కుటుంబ పోషణార్థము

గోవు లిస్తే చాలు. ఆ పరమాత్మ నిరంతర క్రీడా మయుడు. ప్రతి జీవి కూడా ఆ క్రీడను, ఈ విశ్వ వలయాన్ని తిలకిస్తూనే ఉంటాడు. కాని ఒక్క సంగతి మాత్రం తెలుసుకో! ఏ ఒక్కడూ, ఆ క్రీడించే వ్యక్తిని చూడలేడు. ఈ జగత్తంతా నిజంలాగే కనిపిస్తుంది కాని మానవుడు అధ్యాత్మ జ్ఞాన సముపార్జనం చేసిన తరువాత, సమాధి స్థితియందే ఉంటాడు. ఆ అవస్థలో ఏ కోరికా లేగదు. అప్పుడు నిజంగా తండ్రి, బంధువులు, సంతానము, దుఃఖము, దేవతలు-జగత్తూ పాపము, తపస్సు ఇవేమీ ఉండవు. అంతా ఒకే ఒక్క 'సచ్చిదానందము'. అందులోని ఏకాంశము ఈ జగద్విభూతి. అయితే ఎవడు సంతతానుధ్యాన మొనర్చి జ్ఞాన స్థితిని పొందడో, అట్టివాడు కర్మబంధమును విదల్చుకొన జాలడు. అట్టివాడు 'పునరపి జననం పునరపి మరణం. పురుగు ఒక ఆకు తిని ఊరుకోదు. ఒకదాని తరువాత మరొకటి తింటూనే వుంటుంది.

మానవుడు కర్మానుసారము పితృ లోకాలకు, ఆ పైన గంధర్వ లోకాలకు, ఆ మీదట దేవలోకాలకు పోయి ఆ పిమ్మట బ్రహ్మము చేరగలడు. ఆధ్యాత్మిక సంపన్నుడైనవాడు శరీరమును త్యజించిన పిమ్మట, ఆతనిలోని ఆత్మ ఆ బ్రహ్మమునందు సంలీన మవుతుంది"

ఇట్లు జ్ఞానమార్గోపదేశము చేసి రాజు తనకు సమర్పించిన సమస్తసామ్రాజ్యమును తిరస్కరించుటే కాదు, తన శిష్యుడైన జనకుడు జ్ఞానసంపన్నుడైనాడని యెఱింగి తన త్రోవను తాను యాజ్ఞవల్క్యుడు వెడలిపోయినాడు. అట్లు పోతూ తన ఆస్తినంతటినీ ఇరువురు భార్యలకు (కాత్యాయని, మైత్రేయి) విభాగించి యిచ్చి సన్యాసియైనాడు.

కాత్యాయని మారుమాటాడకుండా తన భాగమును తాను తీసికొన్నది. కాని మైత్రేయి తన భాగమును తాను స్వీకరించుట కిచ్చగింపలేదు. ఆమెకీ సంపదకంటె జ్ఞానలబ్ధి, మోక్షములే యెక్కువ. మైత్రేయి తన భర్తనే గురువుగా భావించి తానును సన్యాసాశ్రమమును స్వీకరించినది. అందు మూలముననే యాజ్ఞవల్క్యుడు తాను ఋషి యగుటయే కాక తనవంటి ఋషు లెందరనో సృష్టించినాడు. ఈ కారణం వల్లనే యాజ్ఞవల్క్య మహర్షి 'బ్రహ్మర్షి సమ్రాట్టు' అనిపించుకొన్నాడు.



# భృగు మహర్షి

భృగువులు శ్రేష్ఠతర మైన జాతికి చెందినవారు. అగ్ని భట్టార కుని, అసంఖ్యాకమైన వేదఋక్కులతో ఆరాధన సేయు పద్ధతికి మూల పురుషులు ఈ భృగు వంశము వారే. ఈ విధానమును తొలుత రూపొందించినది కూడ భృగు వంశజులే.

తైత్తిరీయ బ్రాహ్మణము 'ఆంగీరస మహర్షియు, ఆదిత్య భృగువును బ్రహ్మ మానస పుత్రులని' నిర్ధారణ చేసినది. గోపథ బ్రాహ్మణము కూడ ఈ వాదమునే అనువర్తించినది. అంత మాత్రమే కాక యీ గ్రంథము మరికొన్ని వివరములను లోతులను వెల్లడించినది. ఒక మారు బ్రహ్మ తీవ్ర తపో మధ్యమున నుండి ఈ విశ్వమును సృష్టింప సంకల్పించినాడు. ఆ భావన వచ్చీ రాగానే, ఆయన నుదుటి నుండి స్వేదబిందువు (చెమట బొట్టు) ఒకటి రాలి భూమిపై పడినది. అది నేలపై పడీ పడటంతో రెండుగా అయినది. అందొక భాగము శుద్ధము, శుభ్రము, ఆస్వాదయోగ్యమునై యుండెను. రెండవ భాగ మంత మంచిగా లేదు. ఆ తరువాత అనువైన కాలములో, తొలి బిందువు నుండి భృగువు పుట్టినాడు. రెండవ బిందువు నుండి అంగీరసు డుద్భవించినాడు, కాల క్రమమున భృగువు పదిమంది అథర్వులకు తండ్రియైనాడు వారు కారణంగానే బ్రహ్మ దేవుడు, వేదంలో కొంత భాగాన్ని కల్పించటం జరిగింది. అందుకే ఆ భాగమునకు 'అథర్వ వేద'మని, పేరు వచ్చినది.

అంగీరస మహర్షికి పదిమంది సంతానము. వారే ఆంగీరసులు. వారి నుండి, బ్రహ్మ ప్రకల్పించి చెప్పినదే ఆంగీరస వేదము. పలు

ప్రాచీన గ్రంథములు భృగు మహర్షి, స్వాయంభువ భృగువు, వారుణి భృగువు జామదగ్న్య భృగువు ఆదిగా పలువు రున్నట్లు పేర్కొంటు న్నవి. అదే తీరున అంగీరసుడు కూడ భృగ్వాంగీరస, భరద్వాజాంగీరస, గౌతమాంగీరస ఇత్యాదిగా పలువు రున్నట్లు చెప్పుచున్నవి. ఒక్క తైత్తిరీయోపనిషత్తు మాత్రమే భృగువును వరుణదేవుని సంతానముగా చెప్పినది.

ఈ భృగువు బ్రహ్మ మానస పుత్రుడు. అందుచేతనే పరమ శివునకు బావమరది యైనాడు. భృగువు వైవస్వత మన్వంతరమం దున్నవాడు. ఈయన దక్షు డొనర్చిన యజ్ఞమున కేతెంచినట్లు చెప్పబడినది. ఈ యజ్ఞముననే మహేశు డవమానింప బడినది, దక్షుడు తన యల్లుడైన శివున కాహ్వానము పంపనిది కూడా దీనికే. శివుని ఆగ్రహోదగ్రత ఇంతింత అని చెప్ప లేనంతగా నుండెను. తుదకు దక్షాధ్వర ధ్వంసమునకే శివుడు నిర్ణయించుకొని, ఆ పనికై నందీశ్వరుని నియోగించినాడు. కాని భృగు మహర్షి ఆ నందిని దూర ముగా పారద్రోలుటయేగాక, శపించినాడు కూడా. అప్పుడు రుద్రుడు వీరబాహుని పిల్చి, భృగువును తగురీతిగా శిక్షింపు మని ఆదేశించినాడు వీరబాహువు భృగువు కంటె అమితమైన శక్తి కలవా డగుట దక్షుని యజ్ఞ కుండమును విధ్వంస మొనర్చుటే కాదు, భృగువు మీసములను సైతము కాల్చివైచినాడు. తుదకు మహర్షు లందరి స్తోత్రములకు సంప్రీతుడై, కాలిపోయిన భృగువు మీసములు మరింత పైకి ఏర్పడునట్లుగా అనుగ్రహించినాడట! అందుచేతనే భృగువు ముఖము కొంత విరూపత నందినది.

భృగువునకు శ్రీమహా విష్ణువుతో గల సంబంధ బాంధవ్య ములను గురించి భిన్నవాదము లున్నవి. దేవీభాగవతము భృగువును విష్ణువైరిగా పేర్కొన్నది. చిరకాలముగా వస్తున్న దేవాసుర సంగ్రా

మమే యిందులకు హేతువుగా చెప్పబడినది. ఒకమారు దేవ దాన వులు పోరు సల్పుచుండగా, అనుకోకుండా మహావిష్ణువు భృగువు ఆశ్రమమునకు వచ్చి ఆ మహర్షి భార్యను చంపినాడట ! ఆ సమయ మున మహర్షి తపస్సు చేసికొంటూ దూరంలో ఎక్కడో ఉండుట తటస్థించినది. మహర్షి మృతసంజీవనీ విద్యను సాధింప నెంచి ఘోర తపము చేయుచుండెను. రాక్షస గురువైన శుక్రాచార్యుల వారి కీ విద్య అంతకుముందే కరతలామలకము. తపస్సు ముగిసిన పిమ్మట భృగువు తన ఆశ్రమవాటిక కేతెంచి, భార్య మరణ వృత్తాం తమును, విష్ణువు చర్యను గమనించి, తా నంతకుముందే శుక్రుని అను గ్రహమున గడించిన సంజీవనీ విద్యను చనిపోయిన భార్యపై ప్రయో గించినాడు. పరమాశ్చర్యముగా భృగుపత్ని బ్రతికినది. భృగువు కోపోద్వగ్నుడై మహావిష్ణువని యైన నెంచక, సామాన్య మానవ మాత్రునివలె ఒకతల్లి గర్భమున జన్మింపుమని శాప మొసంగినాడు. ఈ వృత్తాంతము యొక్క ప్రస్తావన రామాయణ కథా సంబంధిగా నున్నది.

భృగువు శాప కథనాన్ని పద్మపురాణము మరొక రీతిగా చిత్రించినది. ఒకమారి భృగుమహర్షి చేయు జన్నమును రక్షించెద నని విష్ణువు మాట యిచ్చినాడట ! ఇంద్రు డీ వృత్తాంతము నెరిగి యజ్ఞమున కాటంకము కల్పింప నెంచి తెలివిగా విష్ణువును భృగువు యజ్ఞము చేయు వేళకు రాకుండ జేసినాడు. అందుచే భృగువునకు తన యజ్ఞమును తానే రక్షించుకొనవలసిన పరిస్థితి యేర్పడినది. ఇదే అదనుగా రక్కసులు భృగు వొనర్చు యజ్ఞ ధ్వంసమునకై యత్న మారంభించినారు. ఈ హేతువు చేతనే భృగువు మహావిష్ణువును శపించుట జరిగినది.

అయితే, ఈ పద్మపురాణము నందే ఉత్తర ఖండమున, భృగు

మహర్షి వైతాళికునివలె శ్రీ మహావిష్ణువును కీర్తించినట్లు పేర్కొనబడినది. ఈ సందర్భంగా ఇక్కడ ఒక కథ ఉట్టంకింపబడినది.

ఒక పర్యాయము స్వాయంభువ మనువు యజ్ఞమును నిర్వర్తించుచున్నప్పుడు, ఆ యజ్ఞశాలలో నున్న మహర్షులలో త్రిమూర్తులలో నెవ్వ రధికులను చర్చ వచ్చినదట ! భృగువు లేచి త్రిమూర్తులను, వారి వారి సన్నిధిలో, అతి సమీపంగా చూచిన తర్వాత మాత్రమే తన నిర్ణయము ప్రకటించెదనని పల్కినాడు. వెనువెంటనే భృగువు తొలుత కైలాసగిరి కేగగా, ఆ సమయమున పార్వతీ పరమేశ్వరులు తమ యంతఃపురములో వినోదకేళిలో నున్నారు. ద్వార రక్షకుడుగా నియుక్తుడైన నంది భృగువు రాకను గమనించి ద్వారము కడ ఆపినాడు. అంతేకాదు ఆ మహర్షికి చేయదగిన స్వాగత సత్కారాదులను సైతము పట్టించుకొనలేదు. మూర్తీభవించిన కోపమువలె భృగువున్నాడు. ఒక్క క్షణమేని విలంబ మోర్వలేక, ఆ మరుక్షణముననే కైలాసమును వీడి బ్రహ్మ యొక్క మందిరము వైపున కేగినాడు. అక్కడ కూడ ఇదే సన్నివేశము భృగువున కెదురయినది. బ్రహ్మ దేవుడు మహర్షిని చూచియు, చూడని యట్లు నటించి తన పనిలో తాను నిమగ్నమైనాడు. దానితో కోపోద్రిక్తుడైన భృగువు ఒకింతసేపు వేచియుండ నోర్వక, మరొకమారు బ్రహ్మ వైపు చూడనైన చూడకుండ, వైకుంఠము దిశగా పయనమయినాడు. సరిగా ఆ సమయంలో మహావిష్ణువు గాఢనిద్రా వశుడై యున్నాడు. అన్నిచోట్ల చుక్కెదురైన మహర్షికి ఓర్పు సన్నగిల్లి, వివేచన కోల్పడి, తిన్నగా విష్ణువు శయన మందిరములోనికి దూసికొనిపోయి నిద్రించుచున్న మహావిష్ణువును కాలితో తన్నినాడు. అయినను విష్ణు విసుమంతయు చలింపలేదు సరికదా ! ఆ మహర్షి కాలి తాపును అవమానముగానైనా పరిగణింపక నిబ్బరముగా నిశ్చింతగా మండిపోయినాడు. అందులకే మహావిష్ణువు వక్షస్థలం మీద

నున్న శ్రీవత్సలాంఛనమును భృగుపాద చిహ్నమే అంటూంటా రిప్పటికీ. తదనంతరము భృగుమహర్షి భూలోకమునకు వచ్చి, స్వాయంభువు యొక్క యజ్ఞశాలలో ప్రవేశించి త్రిమూర్తులలో విష్ణుమూర్తియే సర్వాతిశయుడని తన తీర్పును ప్రకటించినాడట !

మహాభారత మందలి అనుశాసన పర్వములో భృగు శాపము శక్తిమంతమూ వాస్తవము అగుటకు - ఆతని కోపము సత్య సంపూరితమని తెలుపుటను గూర్చిన చిత్రమైన కథ యొక టున్నది.

ఒకానొక వేళ దుర్వినీతుడైన నహుష చక్రవర్తి ఇంద్రపద మాశించి, యజ్ఞో సాధించి తానే ఇంద్రుడైనాడు. ఇంద్రపదస్థుడైన నహుష చక్రవర్తి దేవతలను - రాక్షసులను పడరాని బాధలు పెట్ట సాగినాడు సురాసురుల జీవితములు దుర్భరములు కాజొచ్చెను. నహుషుని భార్యయై ముందు ఎంతవరకు వెళ్ళిన దంటే, ఆ నధిరోహించు రథమును లాగుటకై గుర్రములకు బదులుగా సప్త మహర్షులను విని యోగించినాడు. అట్లు లాగుచున్న సప్తమహర్షులలో అగస్త్యు డొకడు. భృగువు, సూక్ష్మ దేహముతో జడలు కట్టిన అగస్త్యుని శిరస్సుపై ప్రవేశించినాడు. నహుషుడు రాచ ఠీవిని వెలగబెడుతూ నిరుపేద అయిన అగస్త్యుని - రథము లాగు వానిని, నడునెత్తిపై ఒక తాపు తన్నినాడు. ఆ కాలి దెబ్బ అగస్త్యుని జడలలో సూక్ష్మ రూపమున నున్న భృగువునకు తగిలినది. తత్ పర్యవసానమే ఇంద్రపదవి నుండి నహుషుని పతనము !

పద్మపురాణోత్తర ఖండమున ఇంకొక విచిత్రమైన వృత్తాంతము కలదు. ఒకానొకప్పుడు వింధ్య - హిమాలయ పర్యంత మధ్య దేశ మంతా కఱవు కాటకాలతో అల్లాడిపోతున్నది. ఆ కాలంలోనే భృగుమహర్షి ఆ ప్రాంతమున వసించుటకై వెళ్ళినాడు. అక్కడ

షామ పీడుతున్నా దుర్భర వేదనను అనుభవిస్తున్న విద్యాధర దంప తులను పొడగాంచి, వారి పరితాప హేతువు ఆరసినాడు. ఆ జంటలో భర్త వ్యాఘ్రముఖుడు, కాని మిగిలిన దేహమంతా మానవ సంబంధి ఆ యుగళమును గాంచి మహర్షి జాలిపడి ఏకాదశీవ్రతము, ఉపవాస వ్రతములను గూర్చి వారి మనసుల కెక్కబలికినాడు. ఆ మహర్షి మాటలు విన్న ఆ దంపతులు, మహావిశ్వాస పూర్వకంగా ఆ వ్రత మును ఆచరింప తత్ఫలితముగా భర్తకున్న వ్యాఘ్ర ముఖము పోయి సర్వాతి సుందరమైన మానవ ముఖము ఏర్పడినది. అనంతర మా దంపతు లమితానంద భరితులైనారు.

భృగుమహర్షి, మనో సంబంధమైన అతీంద్రియ శక్తులెన్నింటినో గడించి వాసికెక్కినాడు. ఆ మహర్షి మహనీయతను చాటి చెప్ప టకు ఈ నాటికిని సాక్ష్యములుగా నిల్చినవే పద్మ పురాణము, గణేశ పురాణము, మత్స్యపురాణము, మహాభారతము, మహాభాగవతము మున్నగునవి. ఒకప్పుడు బ్రహ్మ సంకల్పించి, దండ కారణ్య భాగంలో చేసిన మహాయజ్ఞమునకు భృగువే ఉద్గాత. భీష్మ పంచక వ్రతమును నిష్ఠతో నెరపిన ఋషివర్యుడు.

ఇంతకు ముందు చెప్పినట్లుగా మృత సంజీవనీ విద్యను సము పార్జించిన దక్షుడు భృగువు. ఈ విద్యవల్లనే మృతుడైన జమదగ్ని మహర్షిని పునరుజ్జీవితుణ్ణి చేసినాడు. భరద్వాజున కీయనయే గురువు. వీత హవ్యునకు బ్రహ్మపద మొసంగిన మహనీయుడు కూడా భృగువే. భాద్రపదంలో సూర్య సన్నిధానంలో భృగు వుంటాడని ప్రతీతి. సోమకాంత మహారాజునకు గణేశారాధనా మహిమ నెఱింగించినాడు. భృగువు ప్రవర ఋషి, మంత్ర ద్రష్ట కూడా.

భృగువున కిద్దరు భార్యలు. ఒకతె 'దివ్య' రెండవ యామె 'పౌలోమి'. దివ్య వలన శుక్రుని, పౌలోమి వలన చ్యవనుని సంతాన

ముగా బడసినాడు. అందు చ్యవనునకు ఆప్నవనుడు, దధీచి అను ఇరువురు కుమారులు కలిగిరి. ఆ మహా వంశమే అసంఖ్యాకులైన భృగువులను, పరశురాముని ప్రసాదించినది. ఈ భృగు వంశములో ఏడు వర్గములు విశేష ఖ్యాతిని గడించినవి. కొన్ని గ్రంథములు అంగీరసుడు, భృగువు వేరు కారని తెలుపుచున్నవి. మరికొన్ని గ్రంథములు ఈ రెంటిని ప్రత్యేక వంశములుగా పేర్కొన్నవి. విచిత్రమేమంటే ఇరు వంశములవారి ప్రవరలు, గోత్రములు మాత్రము ఒక్కటే. ఆచారమునకు భిన్నముగా వీరిలో పరస్పరము వివాహాదులు జరిగినట్లు ఆధారములు కన్పించుచున్నవి. సగోత్ర వివాహములు నిషిద్ధము లను సిద్ధాంత మప్పటికి లేదేమో !



# అగస్త్య మహర్షి

భారతీయ పురాణ గాథలలోను - ప్రముఖంగా జనశ్రుతిలోను అగస్త్యమహర్షి పేరు ప్రహతంగా వినిపిస్తూంటుంది. ఆయన పేరుతో అనేకాద్భుత గాథలు పెనవేసికొని అల్లుకొన్నవి. వేదానంతర వాఙ్మయంలో గాని పురాణాలలో గాని, మరి ఎక్కడ పట్టిన అక్కడ ఈ మహర్షి చరిత్ర మనకు గోచర మవుతుంది. పౌరాణిక గాథ లన్నింటిలోను ఒకే అగస్త్యుడు కనబడతాడు. గాథలలోని వైవిధ్యమును - భిన్న ధోరణులను హేతు బద్ధముగా అనుశీలించినచో, ఈ మహర్షి గాథను పలువురు తమ తమ వాదముల కనుకూలముగా మలచి ఉపయోగించుకొనినట్లు తెల్లమవుతుంది. అట్లయ్యు, ఇన్ని భిన్న భిన్న గాథలకు జనకుడైనవాడు పౌరాణికంగా అనుస్యూతంగా వినవస్తున్న అగస్త్యుడే అను సంగతిని మాత్రము గుర్తునం దుంచుకొనవలసియున్నది.

లోతుగా పరిశీలించినచో, అగస్త్యుడు లేక అగస్తి ఒక ఋషి వంశనామముగా కనపడుతుంది. ఈ పేరునకు సంతృప్తి కరమైన వ్యుత్పత్తి సంస్కృత భాషలో కనబడదు. ఈ పదము ద్రావిడ సంబంధిగా గాని లేదా ఆర్య - ద్రావిడ సంబంధిగాగాని కావచ్చును.

అగస్త్యమహర్షిని గూర్చిన మొట్టమొదటి ప్రస్తావన ఋగ్వేదములో కలదు. అందులో అనేక ఋక్కులు, అనువాకములు ఈతనివే యైనట్లు తెలియవచ్చును. ఈయన భార్యయే 'లోపాముద్ర'. మిత్ర - వరుణులకు పుట్టినవాడే మైత్రా వరుణుడు.

'ఊర్వశి' అనే అప్సరఃకాంతను జూచి ఇరువురు మహర్షులు

మోహావేశమునకు లోనుకాగా ప్రభవించిన వీర్యము, ఒక కుంభమున (కుండయందు) నిక్షిప్తము చేయగా, కాలాంతరమున అందుండి కుంభసంభవుడు అనగా అగస్త్యుడు జనించిన లోక గాథ. అందుచేతనే ఆతడు ఘటయోగిగా కూడ పేర్కొనబడినాడు.

ఈ ప్రాచీన గాథను భాషాతత్త్వ పరముగా విశ్లేషించి చూచినచో ఒక తీరైన సమాధానము తోచును. వేదకాలమునందున్న అగస్త్యుడు ఇంచుమించు క్రీ. పూ. 10వ శతాబ్దిలో నుండి యుండవచ్చునని డా॥ సునీత్ కుమార్ ఛటర్జీ అభిప్రాయ పడినాడు. దీనిని కృష్ణ ద్వైపాయనుడు వేదములను సంహితగా కూర్చిన కాలముగా చరిత్రకారులు నిశ్చయించినారు. ఈ వేదాగస్త్యున కంటె భిన్నుడైన మరియొక అగస్త్యమహర్షి వింధ్య పర్వత సీమలు దాటి ద్రావిడ దేశమునకేతెంచినాడు. ఆతడు మరల ఉత్తరాపథమునకు పోలేదు. ఉత్తర భారత మందలి బ్రాహ్మణ సంస్కృతిని, దక్షిణాపథమునకు గొనితెచ్చి పరివ్యాప్తము గావించిన ప్రాచీన పురోగాములలో ఈ అగస్త్యుడే మొదటివాడు. అప్పటికి బ్రాహ్మణ మతము లేక సనాతన మతము ద్రావిడ దేశపు టంచులను తాకలేదు. అప్పటికి ద్రావిడుల చరిత్ర మసక మసక చీకటిలోనే తారట్లాడుచున్నది. దక్షిణ భారతమునకు క్రీ॥ పూ॥ 5000ల సంవత్సరముల ప్రాంతములో ఆర్యావర్తమునుండి ఈ సనాతన మత వ్యాప్తికై ఈతడు నడుము కట్టుకొని యుండును. ద్రావిడులను గూర్చి దాక్షిణాత్యులను గూర్చియు మెల్ల మెల్లగా ఔత్తరాహులు తెలిసికొన నారంభించినది ఆ సమీప కాలమునందే.

అతి ప్రాచీన తమిళ వాఙ్మయమున అగస్త్యుని గురించిన గాథలు కొన్ని ఉట్టంకించ బడియున్నవి. ఈ గాథలే కాలక్రమమున సంస్కృతభాషలో నున్న 'స్కాందపురాణము'న చోటు చేసికొన్నవి.

ఆ గ్రంథమున అగస్త్యుడు కావేరీనది మూలము వరకూ కొంకణ తీరము వెంబడి ప్రయాణించి, కొడగుజాతి ప్రజలుండే 'కూర్గు'ను చేరి నట్లునూ, అక్కడే ఆయన ఒక ఆశ్రమమును నిర్మించుకొని స్థిరపడి నట్లును చెప్పబడినది. అట్లు స్థిరపడిన పిమ్మట స్థానికుడుగా నుండిన తమిళ ప్రభువు కవేర భూపతి అగస్త్యుని మంత్రిగా నియమించుకొని తన కుమార్తె కావేరి నాయన కిచ్చి పెండ్లి చేసి నట్లొక గాథ. కూర్గుకు ప్రాచీన నామము 'కుటక' అదే కుడగ, క్రమంగా కొడగగా మారి యుండవచ్చునని భాషాతత్త్వవేత్తలు పలువురు చెప్పు చున్నారు. ఈ ఆధారము లన్నింటిని తరచి చూచిన, అగస్త్య మహర్షి తొలి నివాసము 'కొడగు' ప్రాంతమని నిర్ధారింప నగును. అందువల్లనే సంస్కృతములో ఈయనకు 'కుటకముని' లేక కూట ముని అను పేరు ప్రసిద్ధ మయినది. అరవమున 'కూట' అనగా కుండ అని అర్థము. అదే సంస్కృతమున కుంభముని అని కూడ నయినది. క్రమశః అదే కుండలో పుట్టిన ముని అను నర్థములో రూఢ మయినట్లు కనిపిస్తుంది. ఇది మిత్రావరుణుల కథతో సంవదించు చున్నది.

అగస్త్యుడు తమిళ రాకుమార్తె 'కావేరి'ని పరిణయ మాడిన సంగతి ముందే తెలుపబడినది. చోళదేశమున ప్రవహించు నది పేరు కూడ 'కావేరి'యే. ఇక్కడ ఇంకొక విషయము తెలుపవలసియున్నది. చోళదేశ ప్రభువగు కందమాన్ కొడగు దేశమున అజ్ఞాతముగా నుండెననియు, ఆ దేశాధినేతకు అగస్త్యుడు మంత్రిత్వము నెరపినాడని ప్రాచీన తమిళ సాహిత్యము వక్కాణించు చున్నది. ఈ కందమాన్ ప్రభువునకు అగస్త్య, పరశురాములతో సంబంధము కలదని తెలుపు గాథలు కూడ తమిళ దేశమున ప్రచారములో లేక పోలేదు. ఆ దిన ములలో, ఈనాటి కావేరి జన్మస్థాన మయిన 'కూర్గు' నుండి సహ్య పర్వతముల గుండా ప్రవహించి అరేబియా సముద్రమున కలిసినట్లుగా

చోళ సామ్రాజ్యమును 'కందమాన్' పాలించు నాళ్ళలో ఏ పెద్ద నదియు నున్నట్లు కనుపట్టదు. అందువల్ల ఆ ప్రాంతము పాడి పంటలు లేక కరవు కాటకములతో దురపిల్లుచుండెను. అప్పుడు అగస్త్యమహర్షి సహాయ సంపత్తులు, వివేకము కారణములుగా నదీ ప్రవాహ గమనము పశ్చిమము నుండి తూర్పునకు మార్చబడినట్లు, ఆ తీరుగా చోళ దేశమున ఆ నది ప్రవహించి పెద్ద నదిగా విలసిల్లి నట్లు, అదే క్రమశః బంగాళాఖాతము లోనికి సంగమించినట్లు 'మణి మేఖలై' అను ప్రాచీన తమిళ గ్రంథము వాకొనుచున్నది. అట్లు తూర్పు దిశగా ప్రవహించిన ఆ నదికి ఆ రాజు యొక్క కుమార్తె పేరు 'కావేరి'గా ఉంచినట్లు కూడా అందున్నది. ఆ రాచ కూతురు 'కావేరి'యే అగస్త్యుని భార్యగా పేర్కొనబడినది.

ఈ కావేరీ నదిని గూర్చి ద్రావిడ వాఙ్మయమున మరియొక విచిత్ర గాథ ప్రచారము నందున్నది. ఈ కావేరి స్వాయంభువ యనియు, అప్సరస అనియు, ఆమె నగస్త్యుడు ప్రేమించినట్లు, నాటి సాంఘిక నియమములు అడ్డురాగా, ఆ జవ్వని అగస్త్యుని పెండ్లి యాడలేకపోయిన దనియు చెప్పబడినది. ఆ దేవకాంత కావేరియే తొలుత సెలయేరై, పిమ్మట నదీ రూపము ధరించినట్లును, ఆమె ఎప్పటికిని అగస్త్యుని పొందలేక వియోగిని యైనట్లు జనశ్రుతి.

ఇంకొక గాథ, దీనికి మరీ భిన్న మయినది. కూర్గు నుండి మరల అగస్త్య మహర్షి ఉత్తర భారతమున కేగినట్లును, అక్కడ హిమవత్ పర్వతమునకు దిగువ నున్న నరసింహారణ్యమున ఒక ఆశ్రమము నిర్మింపబడి యుండగా అగస్త్యు డా తావున కేగుసరికి, వేదవిహితముగా ఒక మహా యజ్ఞ మచట జరుగుచున్నది. ఆ యజ్ఞ మునకు బలి పశువులుగా గొర్రెలు కొనిపోబడుచుండుటను అగస్త్యుడు

గమనించి, యజ్ఞకర్తల నెట్లో ఒప్పించి ఆ పశుబలిని నివారించినట్లు, దానికి ప్రత్యామ్నాయముగా మూడేండ్లనాటి పాత బియ్యము నన్నముగా వండి హోమకుండమున వేల్చవలసినదిగా నిర్ణయించి నారు. 'అజ' అనే పదానికి గల నానార్థములలో ఒక రకమైన 'వరి' అను నర్థము కూడ దీని కుపబలకముగా నుండుట గమనింపదగినది. అయితే ఈ గాథకు సమన్వయము సరిగా కన్పింపదు. కాని ఇచ్చట ఒక ప్రశ్న పుట్టుచున్నది. వేదకాలమునందు కూడ కొంతమంది బ్రాహ్మణులు జంతుబలి నివారించుటకై యత్నము సల్పినారా ? లేక

జైనమత ప్రభావము వలన ఇది ఏర్పడినట్లా ? లేక ఈ గాథకు సంబంధించిన అగస్త్యు డనంతర కాలమువాడా ? ఇండో - చైనాలోను ఇండోనీషియాలోను అనేక సముద్రములు దాటి అగస్త్యుడు సువిశాల భారతము చేరినట్లు మరికొన్ని గాథలు గలవు. వీటిని చూచిన భారతీయ సంస్కృతీ వికాసమునకై ఈ మహనీయు డా యా దేశములు పర్యటించెనా అనిపించును. ఇండోనీషియాలో ప్రజలు అగస్త్యుని శివావతారముగా, జగద్గురువుగా నేటికిని భావిస్తారు. బుద్ధునకు ప్రతిగా అగస్త్యమహర్షిని ఆ దేశ ప్రజలు పరిగణించినట్లు కూడ కనపడుతుంది. అందువల్లనే కాబోలు శివాగస్త్యుడు ఇండోనీషియాలో భట్టారక గురువుగా ఒక ప్రాచీన శిల్పము మనకు కానవస్తుంది. ఆ ప్రతిమ, గెడ్డముతో మధ్యవయసులో నున్న భారతీయ ఋషివలె కనుపడును గాని సంప్రదాయ సిద్ధముగా నున్న శివాకృతి మాత్ర మా శిల్పమున కానరాదు.

దక్షిణ దేశమున తమిళ ప్రజల అపార గౌరవాదరములకు పాత్రమైన అగస్త్యమహర్షి మరియొకడు కలడు. ఆయన తమిళ సాహిత్యమునకు చేసిన సేవ అనన్యము. తమిళ సంస్కృతి కాయన గావించిన మహోపకృతి మహనీయమైనదిగా ఈ నాటికిని తమిళ విద్వాంసులు

పరిగణించుచున్నారు. సనాతన భారతీయ సంస్కృతికి అగస్త్యుడే వారధి. ద్రావిడుల ఆలోచనా ధారలో మార్పు గొనివచ్చిన దీతడే యని పలువురు పరిశోధకులు భావించుచున్నారు. ఈ అగస్త్యుడే వేదానంతర కాలమందు. ఉత్తరాపథమునుండి బయలుదేరి వింధ్యమును దాటి దక్షిణాపథము చేరి యచట స్థిరపడినవాడు. బుద్ధ, వర్ధమాన మహావీరులు వర్ధిల్లిన రోజులలో అనగా క్రీ. పూ. 6వ శతాబ్ది వాడుగా ఈ అగస్త్యుని మరి కొందరూహించుచున్నారు. ఇదే కాలమున బ్రాహ్మణములు - ఉపనిషత్తులు వ్యాప్తికి వచ్చిన పిమ్మట, ఉత్తర భారతము నందున్న అజాత శత్రువు, మగధ నేలిన కునికుడు వత్స దేశ రాజైన ఉదయనుడు, మాళవ దేశాధిపతి ప్రద్యోతనుడు నున్నట్లు చరిత్రకారులు ఊహించుచున్నారు.

ఈవాడు కూడ, ఆర్య సంస్కృతి కంటె పూర్తిగా భిన్నమైనదే 'ద్రావిడ సంస్కృతి' యని భావించు ద్రావిడ కజగమువారు కూడ అగస్త్యుని రాకను, ఉనికిని, కాదనలేకపోవుట గమనార్హము.

ఇక్కడ హిందూమతమునకు సంబంధించిన మూడు ప్రధాన విషయములు గమనింపవలసియున్నది. 1. బహు ప్రాచీన కాలంలో ఆర్యులు - బ్రాహ్మణులు, క్షత్రియులు, తదితరులు ద్రావిడ జాతులతో పరస్పరము వివాహము లాచరించుకొనుట. పరిపూర్ణ సంస్కృతీ సమైక్యతకు ఇంతకంటె బలవత్తరమైన సుగమమైన సాధనము మరొకటి కానరాదు అగస్త్యుడు 'కావేరి' యను క్షత్రియ కన్యను పెండ్లాడుట ఇందులకు సూచకము. భారతదేశమందంతటా ఇట్టి సంఘటనలు - కలయికలు కోకొల్లలుగా చరిత్రలో కానవచ్చును. ఇందులకు చరిత్రలోనూ, పూర్వ గాథలలోను పలు సాక్ష్యములు లభించుచున్నవి. భారత వర్షములోనూ అన్య దేశములలోనూ భారతీయ సంస్కృతీ వ్యాప్తికై ఈ రకమైన వివాహములను సమైక్యతా దృష్టితో బ్రాహ్మ

మత వ్యాప్తికి, ఈ విశాలదృష్టి ఎంతగానో నాడు దోహద పడినది.

2) ఆర్యుల కంటె పూర్వ మున్న జాతులలో, ఇట్టి సర్దుబాటు ధోరణి, సమానభావము నాలుగు వర్ణములలోను కన్పట్టును. మానవ సమైక్యత కిది ప్రథమ సోపానము. బ్రహ్మ సాక్షాత్కార సాధనలో ఈ ఐక్యతను పూర్వులు గుర్తించినట్లు కనపడుతుంది. బౌద్ధము మున్నగు మతములు కూడ ఈ అఖాతమును పూడ్చుటకే యత్న మొనర్చినవి గాని నాశము చేయుటకు కాదను సంగతిని మనము మరువరాదు ఆర్యుల కంటె ముందున్న జాతుల సమైక్యత కీ దృక్పథ మావసర మైనది. అట్లే ఇండో - చైనా, ఇండోనీషియా, టిబెట్టు, వియత్నాం, మంగోలియా, కొరియా, జపాను దేశములలో హైందవ మత వ్యాప్తికి, బౌద్ధమత ప్రచారమునకు ఈ సామరస్య ధోరణి ఎంతగానో ఉపకరించినది. చైనాలో నెలకొన్న బౌద్ధము, అంతకు ముం దున్న తత్త్వ చింతనలతో పొంతన కుదుర్చుకొన్నది. ఆ తీరు ననే జపానులోని 'షింటో' మతముతో అక్కడి బౌద్ధులు సర్దుబాటు పద్ధతి నవలంబించినారు.

3) భారతీయ సనాతన మతముగాని, దాని తరువాత వచ్చిన బౌద్ధముగాని ఆర్యుల కంటెను పూర్వ మందున్న భాషా సంస్కృతు లను పోషించినవే కాని తిరస్కరింప లేదు. తమిళము, ప్రాచీన జపాను భాష, ప్రాచీన కెవారీ, సయామి, మణిపురి, బర్మా భాషా సంస్కృ తులు సనాతన మతవ్యాప్తి జరిగిన పిమ్మట కూడ ఉజ్జ్వలముగా విల సిల్లినవి. అందుమూలముననే, భిన్న సంస్కృతుల కాలవాలములైన ఆ యా దేశములలో, సనాతన భారతీయ సంస్కృతి నిలువరించుకొని నిలువ గలిగినది.

అగస్త్యుని గూర్చి ఒక క్రొత్త శాసన మిటీవల బయలు పడి

నది. క్రీ॥ శ॥ 811లో కంబోడియాను పాలించిన 'యశోవర్మ' తన రాజ్యములో 'ప్రభాతస్థల' అనుచోట వేయించిన శాసనమున ఆర్యావర్తము నుండి వచ్చిన బ్రాహ్మణుని గూర్చిన యొక ప్రస్తావన కలదు. ఆతని పేరు అగస్త్యుడు. వేదవేదాంగములందు నిధి. ఆయన కంబోడియాలో స్థిరపడి అక్కడే ఒక తెను వివాహమాడి కుటుంబముతో నున్నాడట. ఆయన వంశమునం దుద్భవించిన 'యశోమతి' ఆ దేశప్రభువగు యశోవర్మను పెండ్లియాడి 'రాణి' యైనది. ఆ యశోవర్మకు నరేంద్రవర్మ యను కొడుకు, నరేంద్ర లక్ష్మి యను కూతురు కలిగినట్లు పైన పేర్కొన్న శాసనము వివరించుచున్నది.

వింధ్య పర్వత సీమలు దాటి వచ్చినట్లుగా చెప్పబడిన అగస్త్యునివంటివా రెందరో, ఆసియా ఖండములోని దూరప్రాచ్య దేశములకు సంస్కృతీ రాయబారులుగా వెళ్ళినవారు కలరు. అట్టి మహనీయులలో అగస్త్య మహర్షి ఒకడు.



# శ్రీ పాదరాజరు

కన్నడ సాహిత్యంలో హరిభక్తిని వెల్లడించే దాస సాహిత్యము విశిష్టమైనది. శ్రీపాదరాజరు దాస సంప్రదాయ పితామహులుగా ఈనాటికీ పరిగణింపబడుతున్నాడు. శ్రీపాదరాజరు పదునైదవ శతాబ్దిలో క్రీ. శ. 1406 - 1430 నడుమ తత్త్వ శిఖామణిగా వెలుగొందినాడు. ఈయన మత సంబంధ కార్య కలాపముల లోను తత్ సంబంధి సారస్వత ప్రచారకుడుగాను ఖ్యాతి గడించినాడు. ద్వైత సిద్ధాంత ప్రవక్త శ్రీ మధ్వాచార్యుల వారి తత్త్వ చింతనా ధారను - సంప్రదాయములను సముద్ధరించినాడు ఈయనను గొప్ప విష్ణుభక్తుడుగాను ధ్రువుని అవతారంగాను చెప్పుకుంటూంటారు.

శ్రీపాదరాజరు బాల్య జీవితాన్ని గురించి రెండు కథలు లోకంలో ప్రచలితమై ఉన్నాయి. ఒక కథ ప్రకారం క్రీ. శ. 1405లో తమిళనాడులోని శ్రీరంగంలో గిరియమ్మ, శేషగిరియప్పలకు పుట్టినాడు. ఈయనకు తొలి పేరు లక్ష్మీనారాయణ. బాల్యంలో పశువుల కాపరి. ఒకమారు స్వర్ణవర్ణ తీర్థులవారని పిలువబడే పురుషోత్తమ తీర్థులవారి బాలుని చూచి, వారున్న పద్మనాభ మఠతీర్థమునకు ఆ పిల్లవాని తలిదండ్రులను రప్పించి, వారి అనుమతిపై కుర్రవాడైన లక్ష్మీనారాయణుని సంరక్షణ భారాన్ని స్వీకరించి, వానికి ఉపనయనం చేసి చతుర్థాశ్రమ దీక్షను క్రీ. శ. 1412లో ప్రసాదించి, లక్ష్మీనారాయణ ముని అని నామకరణ మొనర్చిరట! ఏడవ యేట రాయచూరు జిల్లాలోని నరసింహ క్షేత్రమున (కో॥ప్రా॥) విబుధేంద్ర తీర్థుల వారి దగ్గర విద్యాభ్యాస మారంభించినాడు. ఒకపరి ఉత్తరాది మఠాధిపతులు శ్రీ రామతీర్థులవారటకు వేంచేసి, ఈ బాలుని మేధా

శక్తికి ప్రతిభకు ముచ్చటపడి, ఈ బాల సన్యాసికి 'శ్రీపాదరాజరు' అనే బిరుదమును ప్రసాదించినారు. అప్పటి నుండి అదే పేరుతో వ్యవహరింపబడుతూ వచ్చినారు. విద్యాపరిపూర్తి యైన పిమ్మట, శ్రీపాదరాజరు స్వర్ణవర్ణలోని పురుషోత్తమ తీర్థులను సేవించి వారి సేవలోనే కొంత కాల మున్నారు. శిష్యుడైన ఈ పిల్లవానికి సర్వ అర్హతలు గలవని గుర్తించి, చరమ దశలో ఈ పీఠాధిపత్యమును శ్రీపాదరాజరున కనుగ్రహించి, వారు క్రీ. శ. 1420లో బృందావన మున ప్రవేశించిరి.

రెండవ కథన మిట్లున్నది. శ్రీపాదరాజరు క్రీ. శ. 1406లో చెన్నపట్నము తాలూకాలోని అబ్బూరులో జన్మించినారని, తలి దండ్రులు గిరియమ్మ, శేషగిరి ఆచార్యులనీ, బాల్యంలో పశువులను కాస్తూ తమ కొబ్బరి తోటను చూచుకుంటూండే వాడనీ చెపుతారు. ఒకనాటి సాయంకాలం ఈ బాలుడు శ్రీరంగపట్నం నుంచి స్వగ్రామ మైన అబ్బూరుకు పయనిస్తుండగా, శ్రీస్వర్ణవర్ణ తీర్థ శ్రీపాదులు లక్ష్మీనారాయణను చూచినారట ! శ్రీ తీర్థులవారు మఠం నుండియే బాలుడైన లక్ష్మీనారాయణుని తల్లిదండ్రులకు వర్తమానం చేసి, వారి అంగీకారము గైకొని ఆ బాలుని ఆశ్రమమునకు స్వీకరించినారు. పిమ్మట శ్రీ స్వర్ణవర్ణ తీర్థులవారే స్వయముగా వానికి శిక్షణ నిచ్చి, కాలాంతరమున తమ సంస్థానమును లక్ష్మీనారాయణ కిచ్చినారు. పీఠాధిపతియైన తరువాత రాఘవేంద్ర మఠాధిపతులైన విబుధేంద్ర తీర్థులతో ఈయన పలు తీర్థయాత్రలు సాగించినారట !

## రచనలు

శ్రీపాదరాజరు రచించిన ప్రధాన గ్రంథము 'వాగ్వజ్ర'. ఇది తర్క శాస్త్ర గ్రంథము. శ్రీహరి స్తుతి ప్రధానముగా భ్రమరగీత,

వేణుగీత, గోపీగీతలను కూర్చినారు. నలువది పర్యాయ పదములకు టీకలు వ్రాసినారు. వారు తమ కృతు లన్నింటినీ శ్రీరంగ విఠలునకే అంకితము చేసినారు. శ్రీకృష్ణునిపై పదా లెన్నింటినో రచించినారు. వారి గీతికలు పద్య సులాది ఉప భోగములతో కూడినవే. 'సులాది' అనే దాన్ని సంగీతంలో ఒక బాణీగా రూపొందించినారు. నుడి లేకుండా ఉన్న పల్లవినే 'సులాది' అంటారు.

శ్రీమద్భగవద్గీతలోని పది ఖండములకు సంగీతమును కూర్చినారు. శ్రీ మధ్వనామ, శ్రీ మారుతీ అవతార, భీమసేనావతార అనునవి వారు కూర్చిన కీర్తనలలో ప్రముఖమైనవి ఆయన కూర్చిన కీర్తన లన్నీ వైష్ణవ సిద్ధాంతమును ప్రచారము చేసినవే.

## తీర్థయాత్రలు

ఒకమారు విబుధేంద్ర తీర్థులు, లక్ష్మీనారాయణ యోగి, రఘునాథ తీర్థులు చాతుర్మాస్య దీక్ష నెరపుటకై రాయచూరు జిల్లా లోని కోద్రాకు పయన మయినారు. విబుధేంద్రస్వాములు పీఠాధిపత్యమును చేపట్టిన తరువాతనే విద్యానిధి సన్యాసాశ్రమము స్వీకరించినది. రఘునాథ తీర్థులవారికి విద్యానిధి సాక్షాత్తు శిష్యులే. లక్ష్మీనారాయణ యోగి రచించిన 'న్యాయ సుధానువాదము'ను చదివి రఘునాథ తీర్థుల వారెంతో ఆనందించినారు. వారే లక్ష్మీనారాయణ యోగికి 'శ్రీపాదం' అను బిరుదును ప్రసాదించిరి. శ్రీపాద మనగా మఠాధిపతి అని యర్థము. శ్రీపాదరాజరు అనగా పీఠాధిపతులకే రాజని అర్థము.

శ్రీపాదరాజరుకు ఒకనాడు కలలో రంగవిఠలుని విగ్రహము-అది యున్నచోటు స్ఫుటముగా గోచరింపగా, నిద్దురనుండి లేచి భీమరథీ నదీ తీరమున కేగి బంగారు పెట్టెలో నిక్షిప్తమై యున్న రంగ విఠల విగ్రహమును గొనివచ్చినారట !

శ్రీపాదరాజరు విజయనగర యాత్రను ముగించుకొని 'ముల్‌బగల్'కు తిరిగివచ్చి, అక్కడి మఠమున లక్ష్మీనారాయణ విగ్రహమును ప్రతిష్ఠించిరి. ఒకమారు శ్రీపాదరాజరు శిష్యులకు పాఠ ప్రవచనము చేయుచుండగా, వారి తలపై ఎక్కడినుండియో యెగిరి వచ్చి ఒక పువ్వు పడినదట ! అది గమనించిన గురువు శిష్యులతో "ఇది రఘునాథ తీర్థులవారు స్వర్గధామమునకు పోవుచూ, తన శిరస్సుపై ఈ పువ్వును విసిరినట్లు" చెప్పినారట ! ముల్‌బగల్ మఠమున శ్రీరాజరు ఆ దివ్య పుష్పము పడినచోట బృందావన పద్ధతిలో ఒక వేదికను నిర్మింపజేసిన దిప్పటికీని కలదు.

విజయనగర ప్రభువు 'సాళువ నరసింగరాయల'వారి ఆలంబముతో శ్రీపాదరాజరు శిష్య సమేతంగా ఉత్తర భారతదేశమంతటా పర్యటించారు. ఆ యాత్రలోనే కాశీ క్షేత్రం కాశీరాజు సభా మండపమున జరిగిన పండిత సభలో పాల్గొని, దిగ్విజయము సాధించి విశేష ఖ్యాతిని గడించినారు అక్కడ 'దాసకూట' ప్రాముఖ్యమును వ్యాప్తి యొనర్చిన తరువాత, ముల్‌బగల్‌కు తిరిగి చేరుకున్నారు.

సాళువ నరసింగరాయలు విజయనగర సామ్రాజ్యాధీశులు. వారి రాజధాని 'చంద్రగిరి.' ఆ మహానుభావుడు వైష్ణవమును గాఢముగా అభిమానించినవాడు. అట్లయ్యునూ తిరుపతిలోని ఒక అర్చక కుటుంబమును తుద ముట్టింపగా, ఆయనకు బ్రహ్మ హత్యాపాతకము చుట్టుకొన్నది. అప్పుడు నరసింహరాయలవారి ఆహ్వానముపై శ్రీపాదరాజరు చంద్రగిరికి విచ్చేసి, బ్రహ్మ హత్యాదోష పరిహారమునకై తమ శంఖము నుండి పవిత్ర తీర్థమును చల్లినారట ! అందులకు ప్రభువు బ్రహ్మానంద పరవశుడై స్వామివారిని సింహాసనముపై అధిరోహింపజేసి కనకాభిషేక మొనర్చి శ్రీపాదరాజరు కొక వజ్ర కిరీటమును ప్రదానము చేసినాడు.

ముల్‌బగల్ (కోలారు జిల్లా) ఈనాటికిని సుప్రసిద్ధ వైష్ణవ క్షేత్రముగా విరాజిల్లుచున్నది. శ్రీపాదరాజరు యొక్క ప్రధాన కేంద్ర మదియే. ఆ కేంద్రమునుండియే వారు మధ్వ సిద్ధాంతమును దేశ నలుమూలలా ప్రచార మొనర్చినారు. శ్రీవారి దిగ్విజయ యాత్రలో ముల్‌బగల్ దర్శించి, కొంతకాల మక్కడనే యుండి పోయినారు. స్వామివా రక్కడ వేంచేసి యున్నప్పుడే శ్రీ మధ్వా చార్యులవారి నాలుగవ శిష్యులు అక్షోభ తీర్థులవారు (క్రీ. శ. 12వ శతాబ్ది) నిర్మింపజేసిన యోగనరసింహస్వామి దేవళములో అర్చనా దికము నిర్వర్తించినారు.

కొంతకాలమునకు వారే ఆధ్యాత్మిక తత్త్వవిచారము సేయు నిమిత్తము ఒక పరిషత్తును సంస్థాపించినారు. అక్కడనే వారు, ఏడేండ్ల వ్యాసరాయరును అబ్బూరునుండి కొనివచ్చి, శిక్షణ నిచ్చి నారు. శ్రీపాదరాజరు వారి కడకు, దేశ మంతటి నుండి ఉన్నత విద్య నేర్చుకొనుటకై ఎందరో వస్తూండేవారు.

మధ్వ మతస్థుల ఆధ్యాత్మిక కేంద్రములలో మిక్కిలి ప్రధాన మైంది ముల్‌బగల్‌లో గల 'పద్మనాభ మఠము.' ఆ మఠము శ్రీ మధ్వాచార్యులవారి శిష్యులైన పద్మనాభ తీర్థులవారిచే స్థాపింప బడింది. శ్రీపాదరాజరు శ్రీరంగ క్షేత్రమునకు విచ్చేసిన తరువాత స్వర్ణవర్ణ తీర్థులవారు బృందావనములో ప్రవేశించినారు. అనంతరము శ్రీపాదరాజరే పద్మనాభ మఠమున కధిపతులైనారు. ముల్‌బగల్-చిత్తూరు రోడ్డులో ముల్‌బగల్‌కు రెండు కిలోమీటర్ల దూరమున నరసింహ తీర్థ మున్నది. శ్రీపాదరాజరే గంగార్చనకై ఆ తీర్థము నేర్పాటు చేసినారు.

శ్రీపాదరాజరు కన్నడ సాహిత్యము నెంతగానో అభిమానించి నారు. దాస సాహిత్యమును విస్తృతముగా ప్రచారము గావించిన

ఆద్యులలో ప్రముఖులు. ఈ సాహిత్యము కన్నడమున ఒక క్రొత్త శాఖను నెలకొల్పినది. శ్రీహరిని కీర్తించుటే దాస సాహిత్యము యొక్క పరమ లక్ష్యము. అది నిస్సంగత్వము యొక్క భక్తి యొక్క ఘనతను విశేషముగా చాటి చెబుతుంది. ఈ తీరైన సాహిత్యము వ్యక్తి యొక్క నడవడిక పైనా, శీలము పైనా విశేష ప్రభావమును జూపినది. శ్రీపాదరాజరు కాలమునందే దాససాహిత్యము శిఖరము నందుకొన్నది. ఆ కారణముగానే శ్రీపాదరాజరు 'దాస వంశ పితామహులు'గా పేరు గాంచినారు. శ్రీపాదరాజరు కాలమున భగవన్నామములను వైదికులు కూడ కన్నడముననే గానము చేసినట్లు తెలియుచున్నది.

హోసూరుకు చెందిన దేవత 'హోసురమ్మ'. ఈమెయే దుర్గాదేవి. హోసురమ్మ అనే భక్తురాలికి గ్రుడ్డితనము రాగా, శ్రీపాదరాజరు హోసూరు గ్రామమునకు వెడలి ఆమె కనురెప్పలపై సాలగ్రామ శిల నుంచగా ఆమెకు దృష్టి వచ్చినదని చెప్పుకొంటారు. దానికి చిహ్నంగా ఆ దేవత కన్నులలో సాలగ్రామాలు కనిపిస్తాయి. ఆమె యిప్పటికీని గ్రామ దేవతగా ఆ ప్రాంత ప్రజల మన్ననల పొందుతూ పూజ లందుకొంటున్నది.

విజయనగర ప్రభువు సాళువ నరసింహరాయలు గజపతిరాజులతో సంగ్రామ మొనర్చి విజయము చూఱగొన్న పిమ్మట, గజపతి రాయలవారికి హస్త కంకణమును కానుకగా నొసంగినారు. రాయలవా రా కంకణమును శ్రీపాదరాజరు కర్పింపగా, ఆయన రంగ విఠలుని పేటికలో నుంచినారు. పద్మనాభ మఠమునందున్న హయగ్రీవమూర్తి ఎప్పుడూ కదలుచుండుటను తిలకించి శ్రీపాదరాజరు ఆ మూర్తిపై ఒక తెర వైచి, తన మఠములో దానికి నిత్యార్చనలు చేయుచుండువా రట !

'హరిదాసకూట' మనునది కీర్తనకారుల, కీర్తన ప్రచారకుల సంఘము. హరిని కీర్తించు ప్రసిద్ధ పదకర్తల, గాయకుల టమికూ ఈ సంగీత సభకు శ్రీపాదరాజరు చక్కని పునాదులు వైచినారు. ఆనాటి 'దాసకూటమి'కి వారే సారథి. విష్ణు సంకీర్తనల ప్రచారమే ఈ వ్యవస్థ ప్రధానాశయము. వైష్ణవ తత్త్వమునకు పునర్వికాసము కల్గించినది కూడ ఈ సంస్థయే. ఎందరో ఈ కీర్తనలు - పదములు విని ధర్మమార్గానువర్తులైనారు. హరిదాసులనే భాగవతులని కూడ పిలుచుట కలదు.

శ్రీపాదరాజరు కడ శ్రీవ్యాసరాయరు పన్నెండేండ్ల పాటు విద్యాశిక్షణ పొందినారు. కొంత కాల మయిన తర్వాత శ్రీవ్యాస రాయరు తమ గురువులు బ్రహ్మణ్య తీర్థులు, శ్రీపాదరాజరులతో పండరీపుర యాత్ర గావించినారు. అక్కడనే శ్రీపాదరాజరుకు దేవతా విగ్రహము లున్న పేటిక యొకటి లభించినది. ఆ పేటికతో శ్రీపాద రాజరు ముల్‌బగల్ చేరి దానిని తెరువగా, అందు రెండు సంపుటులు గాన వచ్చినవి. అందొక సంపుటిలో శ్రీరంగ విఠలనాథుడు, రుక్మిణీ, సత్యభామల విగ్రహములును, రెండవ సంపుటిలో శ్రీ వేణుగోపాల, రుక్మిణీ, సత్యభామల విగ్రహములు దర్శన మిచ్చినవి. అటు పిమ్మట ఎంతో కాలము శ్రీపాదరాజరు ఆ విగ్రహ పట్కములకు నిత్యార్చ నలు చేయుచునే యుండిరి. వారే శ్రీ వేణుగోపాల, రుక్మిణీ సత్య భామల విగ్రహములను తమ ప్రియశిష్యులైన శ్రీ వ్యాసరాయరువారి కొసంగిరి. శ్రీపాదరాజరు సూచనలపైననూ సాళువ నరసింగరాయల వారి ఆహ్వానము పైననూ శ్రీ వ్యాసరాయరు తిరుపతి మహా క్షేత్ర మున కేగి అటనే పన్నెండేండ్లు ఉండిపోయి అక్కడి పాలనా వ్యవస్థను ఆలయ వ్యవస్థను క్రమబద్ధీకరించినారు.

శ్రీపాదరాజరు క్రీ శ. 1480లో హరిచరణ సన్నిధానము

నొందిరి. ప్రతి యేటా జ్యేష్ఠశుద్ధ త్రయోదశినాడు, అక్కడ రథో
వముతో పాటు శ్రీపాదరాజరు ఆరాధనా మహోత్సవాలు వైభవం
జరుగుతుంటాయి. అన్ని ప్రాంతాలనుండి భక్తులా ఉత్సవముల
వస్తూంటారు. శ్రీ పాదరాజరు బృందావనము శ్రీ నరసింహ తీర్థప
చెంతనే నేటికిని ఉన్నది.



# మురారి బాపు

సౌరాష్ట్రము మన కందించిన భక్తశేఖరులలో మురారి బాపు అగ్రేసరుడు. ఈయన పూర్తిపేరు మురారిదాసు ప్రభుదాసు హరియాని. అయితే జన మంతా ప్రియంగా ఆయనను 'మురారి బాపు' అని పిలుస్తూంటారు. ఈయన నివాసము సౌరాష్ట్రలో 'మాహువా'కు ఐదు కిలోమీటర్ల దూరమందున్న 'జల్ గజరాడ్.' చిన్నప్పుడు మురారి బాపు తాతగారు మనుమని చేత రోజూ కనీసము తులసీదాసు రచించిన 'రామ చరితమానస్'లోని ఐదు పద్యాలనైనా కంఠస్థము చేయించేవారు. ఒక పర్యాయము బాల మురారి ఆత్మను రెండు పద్యాలు బాగా కదల్చినాయి.

సీతారామ చరణ రతి మేరే
అనుదిన బఢహుం అనుగ్రహ తేరే

రామ చరణ వారిజ జబ దేఖుహుం
తబ్ నిజ జనమ సఫల కరి లేఖుహుం

అప్పటి నుండి మురారిబాపు గోస్వామి తులసీదాసు రామాయణమును ఆరాధిస్తూనే యున్నారు. ఇటీవలనే ఆ మహాభక్తుడు 108 మార్లు 'రామచరితమానస్'ను ఏకాగ్రతతో పారాయణము గావించినారు. సాధారణంగా అష్టోత్తర శత పారాయణ ముగిసిన పిమ్మట ఆచారం ప్రకారం హారతి నిస్తారు. అక్కడకు చేరే భక్త గణంలో హనుమంతునకు - రామ ప్రతినిధిగా ఒక భక్తుడు హారతి యిస్తూండేవాడు. పారాయణ ముగిసిన రోజున మురారిబాపునకు

మెరుపులా ఒక ఆలోచన మనసులో మసలింది. శ్రీరామచంద్ర ప్రభువునకు అత్యంతమూ ప్రీతిపాత్రులైన హరిజనులచేత హారతి ఇప్పిస్తే ఎంత బాగుండును. అనుకొన్నదే తడవుగా, ఆ సభలో నున్నవారిలో హరిజనులను వేదికపై రావలసినదిగా బాపు పిలిచి నారు. ఆ అనుభవము మురారి బాపునకు, తక్కిన వారికి ఎంతో ఆనందాన్ని కలిగించింది.

మురారి బాపు గ్రంథ పఠనమునకంటె వినుటకే మిక్కిలి యిష్టపడతారు. భగవద్గీత, రామచరితమానస్ వారి కిష్టమైన గ్రంథాలు. ఆ మహా గ్రంథాలు రెండింటి విశ్లేషణలో ఆయన విశ్వాసమునకు హద్దులు లేవు. అట్లా అని, మహాభారతాన్ని ఆయన ఉపేక్షించినవాడు కాడు.

మత సంబంధమైన ప్రసంగాలు వినటంలో మనకు, పాశ్చాత్యులకు ప్రధానంగా ఒక భేదము కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ప్రసంగాలు వింటూంటే విదేశీయులకు బుద్ధీంద్రియము తొలిస్థానాన్ని ఆక్రమిస్తే, భారతీయులకు శ్రద్ధ ప్రథమ స్థానాన్ని ఆక్రమిస్తుంది. పరమ విశ్వాసమునే భగవద్విభూతిగా మురారి బాపు గణిస్తారు. ఆత్మ వివేచనలోనే ఆయనకు కాలం గడచి పోతుంటుంది. అంతర్విభూతిని, శాంతిని ఆనందంగా అనుభవించుటలో ఒక విశిష్టత ఆయనలో ఉన్నది. ఎంతమంది భక్తు లాయనను పరివేష్టించి యున్నా మురారి బాపు ఆత్మారాములై ఆ మహా దివ్యానుభూతిని పొందుతూనే ఉంటారు.

మురారి బాపు, జీవితంలో అప్రయత్నంగా ఎంతోమందిని ఆధ్యాత్మిక - సాంస్కృతిక - సంస్కరణ రంగాలలో పేరు ప్రఖ్యాతులు మోసినవారిని కలుసుకొన్నారు. అందులో ప్రముఖులు పాండురంగశాస్త్రి అథవాలే, డోంగ్రే మహారాజులు. భారతీయ సంస్కృతి

దిగజారుతున్నందులకు పాండురంగశాస్త్రిగారివలె మురారి కూడ వేదన పడుతుంటారు. మురారి బాపు ప్రసంగాలలో తరుచు ఈ సంగతి వినవస్తూనే ఉంటుంది. వాస్తవానికి మురారి బాపు పఠానమే ఉపన్యాసముకంటె మహత్తరమైనది. ఏదో విధంగా అంతర్ముఖంగానో బహిర్ముఖంగానో రామనామ ప్రస్తావన చేస్తూనే ఉంటారు.

లోకంలో ఎవరైనా సామాజికంగా సమున్నత స్థితిని అందుకొంటే, వారి చర్యల గురించి, అలవాట్ల గురించి, అద్భుత కథలు ప్రచారములోనికి వస్తాయి. కొందరు మురారి బాపు మహిమంతా ఆయన కప్పుకొనే నల్లని శాలువాలోనే ఉందంటారు. ఈ అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా మురారి బాపు త్రోసిపుచ్చినారు. ఏ నల్లని శాలువాతోనైనా తాను ప్రతిరోజు కప్పుకొనే శాలువా మార్చటానికి తన కే యభ్యంతరమూ లేదనీ, తనకు బాల్యము నుండి నలుపంటే ఇష్టమనీ, విగత భర్తృక యైన తన తల్లి ఎప్పుడూ నల్లచీర ధరించుట కూడా కారణ మయితే కావచ్చునని అంటారు. భగవత్ సామ్రాజ్యంలో మాయాజాలానికి - అద్భుతాలకు చోటు లేదంటారాయన.

ఒక రోజున 'రామచరితమానస' ప్రవచన మయిన తరువాత, 'లుంబుడీ' గ్రామంలో కొందరితో కలసి కారులో ప్రయాణము చేస్తుండగా, వాగ్రీలు అనే హరిజనపేట దగ్గర మురారి బాపు డ్రైవరును కారు ఆపమని, అందుండి దిగి తిన్నగా హరిజనులుండే వాడలోనికి వెళ్ళినారు. ఆ సమయంలో అక్కడ ఒకతను రొట్టెలు ఒత్తుకొంటున్నాడు. ఆతని ప్రక్కనే మురారి బాపు కూర్చున్నాడు. అతను చేసిన రొట్టెలలో ఒకటి స్వామి కర్పించినాడు. దాని నందుకొని బాపు ఆ రొట్టె సగం తిని, మిగిలినది తన కూడా వచ్చినవారి కాయన యిచ్చినాడు. అది మహత్తర దివ్యానుభవంగా ఇప్పుడు

కూడా మురారి బాపు చెబుతుంటారు. ఎవరినైనా దరిద్ర నారా యణుడని పిలిస్తే, ఆయన తపించిపోతారు దరిద్ర శబ్దానికర్థ మెవ్వ రికీ తెలియ దంటూనే, సంఘంలో అందరూ దరిద్రులే అయినప్పుడు మళ్ళీ ఈ విభజన ఎందు కంటారు ?

ప్రతి శనివారమూ మురారి బాపు మౌనం పాటిస్తారు. మనస్సున కది సెలవురోజు లాంటిది. మౌనం పాటించిన రోజున ఆయన ఎంతో తేజోవంతంగా కనిపిస్తారు. అయితే ఆ తేజస్సును ప్రజలకే తిరిగి విని యోగిస్తారనే సంగతిని మరువరాదు.

మురారి బాపుకు 'మీరా' కంటె కూడా, రామాయణము లోని 'శబరి' అంటేనే ప్రీతి. మీరాబాయి ద్వారకాధీశుని దర్శన మునకై తనంత తానుగా వెళ్ళింది. మరి శబరి ! సాక్షాత్తు భగవాను డైన శ్రీరామచంద్రుడే స్వయముగా ఆ వృద్ధ భక్తురాలి కడకు విచ్చేసినాడు. ఆ స్వామి ఆమె హృదయంలో ప్రవేశించి, దానినే కోవెలగా మార్చివేసినాడు. గుహుని కథ వింటే మురారి బాపు గుండె కరగిపోతుంది. గుహుడు శ్రీరామచంద్ర ప్రభువును పడవ దాటించిన పల్లెవాడు. నిర్భీతిగా వ్యవహరించే వ్యక్తి. అయినా దాశ రథి యెడల గుహునకు గల భక్తి నిస్సీమము. నదిని దాటేవారి రాక కోసం అతను ఎదురు తెన్నులు చూడడు. వారి నంతగా లెక్క చేయడు కూడా. ఎవరు నదిని దాటాలన్నా తనను సమీపించాలి సిందేనని భావిస్తాడు. అందువల్లనే శ్రీరాముడు ఆవలి యొడ్డుకు తమ ముగ్గురినీ దాటించవలసిందని గుహుని స్వయముగా అర్థించినాడు. గుహుడు శ్రీరాముని చరణారవిందములను గంగా ప్రవాహంలోని నీటితో కాక, తన తాటాకు చేదతో నీటిని గంగనుండి చేదుకొని కడిగినాడు. నిజ మాలోచిస్తే ఆ గంగాజలము తననుగాని, తన వంశమువారిని గాని ఉద్ధరించలేదు. శ్రీరామచంద్రుని పాదాలే తమ

వారి సంపదనీ ఉద్ధరించినాయి. అట్టి గుహుడు పేరాసకు లోనయిన వాడు కాడు. భయస్థుడూ కాడు. పడవ దాటడానికి కేవు (రుసుము) శ్రీరాముని అడుగనూ లేదు, తన పడవను నిలిచి వెళ్ళమని కోరనూ లేదు. ఇంతకూ గుహుని చరిత్రవల్ల మనకు తెలుస్తున్నదేమంటే భయమునకూ ఆశకూ మానవుడు లోబడరాదు ఈ రెండే లోకంలో జన సామాన్యమును బంధించు చున్నవని తెలియవలసి యున్నది.

మురారి బాపునకు రామాయణములో ఇష్టమైన మరొక పాత్ర 'ఊర్మిళ.' ఊర్మిళ ఎప్పుడూ మౌనంగానే ఉండిపోయింది. ఒక నిరాడంబర పద్ధతిలో జనక మహారాజు, వారి కుటుంబము, పరివారము సీతారాము డన్న పరమ ప్రీతి. అటువంటప్పుడు జనక తనూజ ఊర్మిళ మరొకలాగున ఎట్లా ఉంటుంది ? ఆమెకు మౌనమే నైజము. ఆమెకు మాట కంటె మౌనమే మిక్కిలి శక్తి గలదిగా విలసిల్లినది.

'రామచరిత మానస' అనే పేరు రామకథకు ఉంచుటలోనే తులసీదాసు అనంతమైన అర్థము నిమిడ్చినాడు. ఆ పేరే ఒక నిచ్చెన వంటిది. అందు తొలి మెట్టు మనస్సు. శక్తియుతము, పవిత్రమునైన 'మనస్సు' ఉన్నప్పుడే, అది ఉత్తమ 'చరితము'నకు దారి తీస్తుంది. అదియే శ్రీరామచంద్ర ప్రభువును చేరుకొనుటకు సాధన భూత మవుతుంది. అందు వల్లనే రామ చరిత మానస అనే త్రిపుటి మహనీయ మైనదని మురారి బాపు విశ్వసించినారు. ఆయన రామ చరిత మానస కావ్యమునుండి కొన్ని చరణాలు పరమ విశిష్టమైనవిగా భావిస్తారు. ఈ ప్రపంచమే దైవము. దైవమే ప్రపంచము. ఈ అభిప్రాయమే బాలకాండలో ఈ విధంగా ఉన్నది.

'సీయ రామ మయ సబ జగ జానీ

జీవితము పోయినా, పలికిన మాటకూ చేసిన ప్రతిజ్ఞకూ కట్టు వడాలి. అయోధ్యకాండలో చరణాలు గమనించండి.

రఘు కులనీతి సదా చలి ఆ ఈ
ప్రాణజా అరు బచన న జాయీ

దైవమయిన రాముడే సుగ్రీవుని సమీపించినాడు. ఇంత కంటే తాను సాధింపవలసినదేమున్నదని సుగ్రీవుడు అనుకొంటాడు. నిజమే! అంత కంటే ఏమీ లేదు కూడా. అందువల్లనే ప్రజా సేవయే తన కర్తవ్యముగా భావించినాడు. ప్రజలను సేవించుట అనగా పరమాత్మ నారాధించుటయే. ఇదే అభిప్రాయమును తులసీదాసు కిష్కింధ కాండలో వెల్లడించినాడు.

అబ ప్రభు కృపా కర ఉపహి భాంతి
సబ తజీ భజన కర ఓం దిన రాతి

ఎవరైననూ తన ఉత్తమాచరణ ద్వారా, క్రియ ద్వారా ప్రజలను సేవించాలి. మానవుడు అనుదినమూ దైవమును స్మరించు కొంటూండాలి,

తహ హానుమంత బిపతి ప్రభు సోఈ
జబ తబ సుమిరణ భజన నహో ఈ

మండోదరి రావణునితో లంకా కాండలో ఇట్లు అంటుంది. "నీవు పది ముఖాలతో మాట్లాడుతున్నావు. కాని మహా యోగి యైనవాడు ఒక నోటితోనే ఎంతో నైతిక శక్తి నిచ్చే మాటలు పలుకుతాడు." రావణుని అభిశంసిస్తూ ఆమె 'నీవు అడవులకు పోయి విశ్రాంత జీవనము గడపుట ఎంతో మంచిది' అన్నది. రావణునకు

సన్యాసాన్ని స్వీకరించమని చెప్పినట్లయినది. చూడు రాము ఇప్పుడే అరణ్యవాసాన్ని చేస్తున్నాడని అన్నది.

ఇట్లా తులసీ రామాయణంలో అనేక ఘట్టాలలోని పద్యాలకు చైతన్య పూరితమైన స్ఫూర్తి దాయకమైన వ్యాఖ్యానాలు మురారి బాపు చేస్తుంటారు. తులసీ రామాయణ ప్రవచనమునకే ఆయన జీవిత మంకితమైనట్లు కానవస్తుంది. ఇట్టి మహనీయు డుంటున్న కాలంలో మనం జీవించటం గొప్ప అదృష్ట విశేషం. మహా భక్త శేఖరుడు మురారి బాపు. భక్తి ప్రచారమే ఆయనకు శ్వాస ప్రశ్వాసలు.



# మతము : మనశ్శాంతి

మానవుడు కోరదగినవాటిలో అతిముఖ్యమైనది 'మనశ్శాంతి' ఇది యెంతో విలువగల ఆస్తి. ధనము - కీర్తి - ప్రతిష్ఠ మనశ్శాంతికి మాత్రము ప్రత్యామ్నాయములు కావు, కానేరవు.

ఎంతో మంది పైకి ఆరోగ్యవంతులుగా కనబడతారు కాని వారిలో చాలా మంది మనశ్శాంతి లభించక దయనీయ స్థితిలో ఉంటారు. ఏ మానవుడైనా గొప్ప అదృష్టశాలి కావచ్చు, అపార సంపదనూ ఆర్జించవచ్చు. కాని ఆ సంపదవల్ల కలిగే ఆనందాన్ని మనశ్శాంతి లేకుండా పొందజాలడు. ఈ నాడు ప్రపంచదేశాలెన్నో భౌతిక సంపదలు సమకూర్చుకోవటంలో ఆకాశపు టంచులు తాకుతున్నాయి. ఆ సంపన్న దేశాలవారు మానవునకు కావలసిన సుఖాలు, సుఖసాధన సంపత్తి చేకూర్చుకొంటున్నారు. కాని ఈ ఆధునిక నాగరిక ప్రపంచంలో తమ వ్యక్తిత్వాన్ని పరిపూర్ణముగా ఆవిష్కరించి, ఉల్లాసాన్నిచ్చే మనశ్శాంతిని మాత్రము పలువురు పొందజాలకున్నారు. ప్రెసిడెంటు రూజ్వెల్టు రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో తమ ప్రజలకు నాలుగు వాగ్దానాలు చేసినాడు. 1) వాక్ స్వాతంత్ర్యము (2) మత స్వేచ్ఛ (3) కోరికలనుండి స్వేచ్ఛ (4) భయమునుండి స్వేచ్ఛ. ఈ నాలుగింటిలో వారు తొలి మూడింటిని సాధించినారు కాని నాల్గవది మాత్ర మింకా చేరుకొనవలసినదిగానే ఉండిపోయింది.

ఈ నాటికీ ప్రజలు సాటి పౌరులంటే భయపడుతూనే ఉన్నారు. హత్యల సంఖ్య తగ్గుముఖం పట్టటం లేదు. అందులో ప్రపంచంలో కెల్లా 'న్యూయార్కు' మహానగరానిదే అగ్రతాంబూలం. అమెరికా జనాభాలో ఇంచుమించు సగంమంది ప్రజలు నిద్రమాత్రలకో, మాదక ద్రవ్యాలకో అలవాటు పడినవారే. అట్లయ్యు వారు విపరీత మానసిక ఒత్తిడులనుండి ముక్తి పొందజాలకున్నారు. ఇంత కంటే మహా విచిత్రము మరియొకటి యుండదు. అభివృద్ధి చెందిన దేశాలలోగాని, చెందుతున్న దేశాలలో గాని, నియంతృ పాలనలోగాని ప్రజా స్వామ్య పాలనలోగాని ఉంటున్న సామాన్య మానవుడు, అనుదినం మానసిక శాంతికై తంటాలు పడుతూనే ఉన్నాడు. కాని ఆ ప్రయత్నాలన్నీ నిష్ఫల మవుతున్నాయి.

ఒక దేశము యొక్క అభ్యుదయాన్ని, అక్కడి పౌరుని తలసరి ఆదాయాన్ని పొందే వస్తు సంపదలనూ, సేవలను పరిగణనలోనికి తీసి కొని ఆర్థిక శాస్త్రవేత్తలు, గణాంక నిపుణులు లెక్కలు కడుతు న్నారు. ఈ అంకెలు వ్యక్తి జీవన స్థాయిని, దేశపురోభివృద్ధిని చెపు తున్న సంగతి నిజమే కాని, ఈ వివరాలూ, పురోభివృద్ధి పటములూ ఎంత మేరకు ప్రజాసామాన్యము మనశ్శాంతిని పొందుచున్నదో మాత్రము చెప్ప లేక పోతున్నవి.

మనశ్శాంతి రెండు రకాలు. (1) అనుకూలము (2) ప్రతి కూలము. భయము - ఆవేదన - కోపము, ఇతర దురుద్రేకములను దూరములో నుంచుట ప్రతికూల మార్గము. దీనివల్ల మానవుడు కొంతైనా అంతరంగ శాంతిని పొందగలుగుతున్నాడు. శాంతి సౌమనస్యము - ఓరిమి - సమతలు ఆధార పీఠాలుగా మానవుడు జీవన సరళి సాధించుట ఉత్తమ మైన అనుకూల పద్ధతి. ఒక్క సంగతి యిక్కడ చెప్పాలి. ప్రతికూల శక్తులను పారద్రోలటం ఒకంత సులువుకాదు. వారి వారి రంగాలలో ఉన్నతోన్నత శిఖరాలందు

కొన్ని మహనీయులు కూడా వీటిని అదుపులో పెట్టి జయించుటలో విఫలులై క్లేశముల పాలైనారు. మనశ్శాస్త్రవేత్తలు మాత్రము, వ్యక్తి నిండుగా ఉండుట మనస్సుకు, శరీరమునకు మంచిదంటారు. మరి కొందరు శాస్త్రజ్ఞులు గట్టిగా ఏడ్చుట వల్ల కన్నులు మరింత అందాన్ని సంతరించుకొంటాయంటారు.

ప్రతికూల మార్గంలో దురుద్దేశాలను పరిహరించటం కంటె, అనుకూల పద్ధతిలో మనశ్శాంతికై యత్నించుట మరెంత కష్టమని అనే వాళ్ళు లోకంలో లేకపోలేదు. ఓరిమి, ప్రశాంతతలను ఆచరించి చూపే పాఠాలను ఏ మతమూ, శాస్త్రమూ, విద్యా, కళా నేర్ప జాలవు. నిత్యజీవితంలో ఈ రెంటినీ అలవరచుకొనే పద్ధతిని కొంత మేరకైనా అభ్యాసము చేయుట ఈ దిశలో ఒక ఆశాకిరణం. ఈ ఆచరణకై బుర్రలు బద్దలు కొట్టుకుంటున్న వాళ్ళూ, ఆలోచనలు చేసే వాళ్ళూ లోకంలో లేకపోలేదు. అయితే మనశ్శాంతిని పుష్కలంగా సాధించినవారు ఎప్పుడూ అరుదుగానే ఉంటారు లోకంలో.

భయంకర పోరాటమే జీవన విధానంగా మారుతున్న ఈ నాటి పరిస్థితుల్లో, అసంఖ్యాకులైన ప్రజలకు జీవయాత్రకు తాపత్రయ పడుటతోనే రోజంతా గడచిపోవడం గమనిస్తున్నాం. అందువల్ల, అనుకూల శక్తులను ప్రోదిచేసికొనుటగాని, వ్యతిరేక శక్తులను త్రోసి వేయుటగాని ఈనాడు మరింత దుర్ఘటమగుచున్నది. జీవితము విలువైనదిగా రూపొందించుకొనవలెనంటే, ప్రతి వ్యక్తీ కూడా ఒక క్రమ పద్ధతిలో తీవ్ర కృషిచేసి శాంతి మార్గములో పయనించాలి. అందులకై పాటుపడాలి. మనశ్శాంతి సాధన జీవిత లక్ష్యములో ప్రధానమైనదిగా పరిగణింపబడాలి.

మంచి ఆరోగ్యానికి ఆయువుపట్టు మనశ్శాంతి. మనస్సూ - శరీరమూ ఈ రెంటి సాన్నిహిత్యమును గూర్చి వైద్య నిపుణులు ఇటీ

వల ఎక్కువ పూనికతో చెబుతున్నారు. ఇప్పటి వరకూ అన్ని రుగ్మతలకు శరీర చికిత్స యొక్కటే పరమ సాధనమని భావించటం జరిగింది. ఆంద్రీ మారిస్ సిద్ధాంతము, మనస్సుకు శరీరముపై నమ్మశక్యము కానంతటి ప్రభావమున్నదని రూఢముగా చెప్పుచున్నది. చెస్టర్ ఫీల్డు 'మనశ్శరీరములు భార్యా భర్తలవలె విడదీయరానంతగా పెనవేసికొని పోయినాయి. ఇందులో ఏ ఒకటి బాధకు లోనయినా రెండవది సానుభూతి ప్రకటిస్తుంది' అంటాడు.

శరీర స్వస్థత ఉంటేనే, ఎవరైనా మనశ్శాంతినీ-ఆనందమునూ అనుభవింపగలుగుతారు. అట్టి అనుభూతికి ఆనందప్రదమైన మనో నిర్మాణం ఆనుకూల్యత దోహదకారులవుతాయి. సదాలోచనల వల్లనూ మహా విశ్వాసము వల్లనూ దీర్ఘరోగాలెన్నో నయమైనవారు లోకంలో లేకపోలేదు. ఎవరైనా పూర్ణారోగ్యంతో వర్ధిల్లాలంటే, సముచితాహార విహారములు - చక్కని అలవాట్లు - ఒడుదుడుకులను ఉద్వేగములను నిభాయించుకొనే ధోరణులూ అవసరము.

మానసిక ప్రశాంతి సంపాదనకు అత్యంత ముపకరించునది మత మొక్కటే. అయితే వెనుకటి యుగాల్లో మతాలు అనైక్యతనూ విద్వేషాన్ని - ఘోర యుద్ధాలను రేపిన మాటను కాదనలేము. బుష్‌వెల్ అనే శాస్త్రవేత్త 'ఉదాత్తములైన దాన ధర్మాలు - రుచి స్ఫీతములైన విద్యా ఫలములు - విలువైన పరిశోధన ఫలితాలు - ఉత్తమ న్యాయ వ్యవస్థలు మతము యొక్క సృజనాత్మకతను, ప్రత్యక్షంగా నిర్వర్త్యము చేస్తున్నవి మతము మానవునకే మేరకు శాంతిని ప్రసాదింపగలదను విషయము, ఆ వ్యక్తి యొక్క దృక్పథముపై ఆధారపడి యుంటుంది' అన్నాడు. బెంజమిన్ డిజ్రెలీ

మతము - విజ్ఞానము ఒక దానితో ఒకటికి పొత్తు కుదరని వని అనుకొనుట పొరపాటే కాదు, తప్పు కూడా. సమత్వము - న్యాయములపై నిల్చే ప్రపంచ వ్యవస్థకు, ఈ రెండింటి అవసరం ఎంతైనా ఉంది. సి. డబ్లియు. షీల్డ్స్ - "మతమే, విజ్ఞాన శాస్త్రాన్ని ఉపేక్షించే అలవాటు మనకు నేర్పింది. అంధ విశ్వాసాలను సృష్టించింది. హింసను - పాశవికతను నేర్పింది. చర్చి, యూరపు ఖండ మంతటినీ చీకటిలో ముంచివేసింది. అట్లే ఈ నాటి విజ్ఞాన శాస్త్రం కూడా మతమును ప్రక్కకు నెట్టివేసింది. అంత మాత్రమే కాదు, మనలో అవిశ్వాసమును, అపవిత్రతను, అనుచిత స్పందనలను ప్రేరేచింది. ఎక్కడ మతము, విజ్ఞాన శాస్త్రము కలిసి కట్టుగా చెట్టా పట్టాలు వేసికొని ఏక ముఖముగా పయనిస్తాయో అక్కడే మానవతి జీవన మాధుర్యాన్ని జుబ్బన మూలలుగా గోలుతుంది" అన్నారు. అతడు చెప్పిన ప్రతి అక్షరమూ సత్యమైనదే.

ఇటీవలి సంవత్సరాలలో ప్రపంచం నలు దిశల్లో నున్న ప్రజానీకం ఆనందారోగ్యము కు మూల కందము మతమని - దానికి గల మౌలిక విలువను గుర్తింప నారంభించినది. అందువల్లనే ఈ నాడు ఎక్కడ చూచినా మత గ్రంథాలు కోకొల్లలుగా ప్రచురిత మవుతున్నాయి. వాటి అవసరమూ పెరుగుతున్నది. మతము యొక్క మౌలిక తత్త్వమును అర్థము చేసికోవాలనే తపన, ఈ నాడు మానవ జాతిలో కొట్టవచ్చినట్లు కాన వస్తున్నది. నిజమైన మత విలువలను తెలుసుకొంటున్నది. మతాలలో భిన్న దృక్పథా లున్నాయన్న సంగతి ఒకటుంది. అట్లా ఉండి కూడా, అన్ని మతముల మూలాలు పునాదులూ చిరంతన సత్యము పైనా సర్వ జన సంక్షేమముపైనా ఏర్పడిన వనుట మరువరాదు. అది కారణంగానే విశ్వ విఖ్యాత వైజ్ఞానిక వేత్త ఐన్‌స్టీన్ 'అన్ని మతాలూ - కళలూ - విజ్ఞాన శాస్త్రాలూ ఒకే విశ్వ విటపి యొక్క శాఖలే' అంటాడు.

ఈ నాడు ప్రపంచ దేశాలన్నింటిలోను ప్రజల జీవన ప్రమాణము, స్థాయి పెరుగుతున్నవి. అన్ని దేశాలూ మనశ్శాంతి సముపార్జనమునకే తొలి పీట వేస్తున్నాయి. ఈ దిశలో కొంత పురోగతి కూడా లేకపోలేదు. ఇక ఆధునిక వైద్య శాస్త్ర రంగాన్ని గమనిస్తే అది ఎన్నో పరమాద్భుతాలను సాధించింది. మరణాల సంఖ్య తగ్గి, ఆయుః ప్రమాణం పెరుగుతున్నది. ఒక్క భారత దేశాన్ని తీసికొంటే 1941 లో సగటు ఆయుర్దాయము 32½ సం॥ లుంటే, 1976-81 మధ్య అది 52½ సం॥ లకు పెరిగినది. అనేక పశ్చిమ దేశాలు, వయస్సు మళ్ళిన వారి భద్రతకై ఎన్నో పథకాలను చేస్తున్నాయి. ఎన్నో అధికార అనధికార సంస్థలు ఈ రంగంలో కృషి చేస్తున్నాయి. అయినా ఆశించినంతగా ఫలితం చేకూరటం లేదు. అందు కొక కారణము కనిపిస్తుంది. మానవుడు తన జీవన విధానంలో శాంతికి అనుగుణమైన సర్దుబాటులు - సవరణలు స్వయముగా చేసికొనలేక పోవటం. దీనికి తగినంత ప్రచారము జరుగవలసియున్నది. ప్రతి వ్యక్తి మనశ్శాంతికి తన వంతు కృషిని నిర్వర్తించాలి. అట్లు కాని నాడు, జన జీవనము ఆరాటల్లో క్లేశాల్లో కూరుకు పోవటం తప్పదు. కాగా, వ్యక్తిగతంగా ప్రతివాడు చక్కని మంచి దృక్పథము నలవరుచుకొనుటకై యత్నించాలి.

ఈ విషయంలో క్రియాశీలత గురించి భగవద్గీతలోని ప్రతి అధ్యాయమూ విస్పష్టముగా చెప్పింది. మానవుడు తన జీవిత లక్ష్యమును సాధింప లేకపోవుటకు ప్రధాన కారణము అకర్మణ్యత్వము లేక క్రియా శూన్యత. మానవునిలో ధన సంపాదన - ఆరోగ్య వృద్ధి - సమాజములో పేరు కీర్తులు తెచ్చుకొని ఉన్నత స్థానాని కెదగాలని ఇట్లా ఎన్నో ఆశయాలుంటాయి. కాని వాటి సాఫల్యానికి సముచిత సమగ్ర కృషి చేయుటలో అలసత కానవస్తున్నది. ఇదే పలు వైఫల్యాలకు మూలకారణము.

లోకంలో కొందరికి లక్ష్యములుంటాయి కాని ఏతత్ సిద్ధికై యత్నింపరు. మరి కొందరు కొంతవరకూ యత్నించి మధ్యలో వదలి వేస్తారు. మానవుని ప్రశాంతతను పరాజయము, నిరాశ భంగపరుస్తాయి. దానితో వ్యక్తి జడంగా మారిపోతాడు. సకాలంలో సముచిత నిర్ణయం గైకొనక పోవుటయే ఇందుకు హేతువు. అమెరికన్ మనశ్శాస్త్రవేత్త జేమ్సు ఫార్ 'మనలో ఆశ రెండు విధాలుగా ఉంటుందంటాడు. అందొకటి లక్ష్యము నేర్పరచుకొనుట, రెండవది ఆ లక్ష్య సిద్ధి కనుగుణముగా కృషి యొనర్చుట. ఆశావాదియైన మానవునిలో ఈ రెండూ సమపాళ్ళలో ఉండి పరస్పరమూ సహకరించుకొంటూ, సహాయపడతాయి. లోకమం దెవడేని లక్ష్యమును సాధించి విజయమును పొందినాడన్నచో, అతని కృషి సర్వంకష్టమైనదిగా గ్రహించాలి. శ్రమకు సాక్ష్యంగా నిల్చేది ఫలిత మొక్కటే అనగా క్రియా శీలతయే ప్రధానము. భగవద్గీత మరీ మరీ నొక్కి చెప్పే విషయం కూడా ఇదే.

అర్జునుడు కురుక్షేత్రము నందు ప్రవేశించిన వేళలో - ఆతని మనస్సు సందిగ్ధంతో - అనిశ్చయంతో ఊగిసలాడింది. ఆయన సమరమువల్ల నాశన మెంత భయంకరమైనదో తెల్పి, తన దౌర్బల్యాన్ని వెల్లడించినాడు. అప్పుడు కృష్ణ భగవాను డాతనికి కిట్లు బోధించినాడు. 'లోకమందు కర్మయోగ మొక్కటే ఎవరికైనా గత్యేక్కిస్తుంది సంశయ గ్రస్తులు ఆలోచనా సరళి పలుకీతులుగా ఉంటుంది. కర్తవ్య నిర్వహణ మొక్కటే నీ విధి. అకర్మణ్యాస్వాతము కంటె, క్రియా పరత ఎన్నో రెట్లు దొడ్డది శరీరాన్ని నిలుపుకోవాలన్నా నిరంతర కృషి అవసరం కదా!'' జనకాదులు కర్మవల్లనే సిద్ధి పొందినారు శ్రీకృష్ణ పరమాత్మ కూడా తాను ఎడతెగని క్రియా శీలతలోనే ఉంటానని తెల్పినాడు. క్రియాశీలత గల మానవుడు లోకమున సాధింపరానిది లేదు. ఫలాపేక్ష లేకుండ పనులు జరుపవలెనని యు పల్కినాడు.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" నిస్సంగత్వంలో పనులు చేయవలసిన దనియే పరమాత్మ పదే పదే ఉద్ఘాటించినాడు. అదే మోక్ష సిద్ధికి రాచబాట. కావున మానవుడే పని నైనా పరమాత్మ సమర్పణంగా చేసుకొంటూ పోతుండాలి. ఫలాపేక్ష వదలిపెట్టి సరయు మంతో ఉండమని పరమాత్మ బోధ.

అయితే నిస్సంగత్వాన్ని గురించిన ప్రకరణానికి మనలో విపరీత వ్యాఖ్యానములు చేసిన వారున్నా లేకపోలేదు. ఫలపరిత్యాగ మనగా, ఫలసిద్ధి యెడల అలవోకగా ఉండమని కాదు. ఫలితాలను గురించి అతిగా ఆలోచన చేయవద్దనియే దాని పిండితార్థము. అట్లు ఆలోచింపనారంభిస్తే, అది మరింత అదుర్దాకు తీయక మానదు. ఫలితాలను గురించి యెల్లప్పుడూ తికమక పడుతూంటే, అవి సంపూర్ణ ఫలితముల నీయజాలవు! ఏ రంగమ్మైనా అవిరళ కృషి ఒక్కటే ఆశయ సిద్ధికి ప్రధాన సాధనము. కావున అన్ని కార్య కలాపములూ మంచికే ఫలిస్తాయని ఆశావాదిగా పని చేసుకుంటూ పోవాలి! అంతే కాని, తనకు వచ్చే కీర్తి గురించో, ప్రతిష్ఠ గురించో, ఐశ్వర్యం గురించో ఆలోచింప నారంభిస్తే, అది నిస్సంగత్వాన్ని చెదరగొడుతుంది. మధ్య మధ్య ఎన్నెన్ని చికాకులు. అడ్డంకులు వచ్చినప్పటికీ నిర్విరామముగా కృషి సాగింపవలసిందే. జయాపజయములు వ్యక్తిపై ఆధారపడ్డవి కావు. కావున ప్రతి క్రియాశీలి; తాను శక్తి వంచన లేకుండ చేయుటలిగినది చేశాను; విజయము అదృష్ట శక్తి లోనున్నదని అనుకోవలసియుంటుంది.

నిర్లిప్తతకు నిజమైన అర్థమేమిటి? అంటే మనము చేపట్టిన పనిలో ఆసక్తి లోపించినదా! నిర్లిప్తత అంటే ఆసక్తి లేకుండుట కానే కాదు. యోగ్యమైన ఆసక్తి అని మాత్రమే. లోకంలో న్యాయమూర్తి తానెటూ మొగ్గకుండా నిర్లిప్తుడుగా నుండి ధర్మబద్ధమైన తీర్పు

చెప్పటమే అతని విధి. ఆ వ్యాజ్యము లోని ఆవేశ కావేశాలలో ఆయన ఏమాత్రము కల్పించుకోడు. అనగా క్రియాశీలి అన్ని కార్యకలాపములు దైవ పరంగా నిర్వర్తించ లేకపోతే, కనీసం ఆశా రహితంగా చేయుటనైనా ముఖ్యంగా అలవరచుకోవాలి. అదే నిష్కామ కర్మ. మానవుడు ప్రతిఫలాపేక్షను పూర్తిగా పరిహరించ గలిగితే అట్టివాడు ఎంతటి ప్రతిభా శిఖరాన్నైనా అధిరోహించగలడు.

మానసిక విశ్లేషణవేత్తలు చెప్పేది కూడా సర్వసాధారణ ముగా ప్రతివాడు తానాశించినది పొందగలడనే ఎక్కువ మంది అప జయం పాలవుతున్నారంటే, అందుకు ముఖ్యహేతువు ఫలితం కోసమై అతిగా ఎదురు చూడటం, ప్రతికూలాలోచనలు చేయుటా మాత్రమే. అట్లు కాక అనుకూల సరళిలో ఆలోచించే ధోరణిని మనస్సున కల వాటు చేస్తే, ఫలితాలు ఎప్పుడూ సరిగానే ఉంటాయి. ఫలసిద్ధి కను కూలముగా నిర్లిప్తత పెంచుకొనటం మనం అలవాటు చేసికోవాలి. కేవలం గీతాపారాయణం వల్ల మాత్రం ఏ పనీ నడవదు.

ఘన విజయాలను సాధించిన మహానుభావుల జీవిత చరిత్రలు పరి శీలిస్తే, ఒక్కటి విశేషంగా కనిపిస్తుంది. అది లక్ష్యసిద్ధికై నిర్వి రామ కృషి. అది అటుంచగా, ఎప్పుడెలా ఏ పని చేయాలి అన్నది కాని అది అనుకొన్నంత సులువుకాదు. అనువుకాని కాలములో యత్నిస్తే, అవి అనుకున్నట్లుగా ఫలితాలనియ్యవు. సాధారణంగా భయంవల్లనే పెక్కు మంది అపజయాలను పొందుతుంటారు. మరి కొంత మంది వారు పొందిన శిక్షణ వల్లనో - ప్రవృత్తి వల్లనో - సకాలంలో కార్యాచరణకు పూనుకోలేరు. అట్లాంటి వ్యక్తిగత ప్రవృత్తిని ఛేదించటం కష్టం. 'డైనమిక్ థింకింగ్' అనే గ్రంథంలో ఇట్లా చెబుతాడు "ఏ పనినైనా రేపు చూద్దాంలే అని అనటం ఒక చెడ్డ అలవాటు" అది క్రమశః ద్వితీయ ప్రకృతిగా మారి,

వ్యక్తిలో ఇమిడి పోతుంది. ఈ ప్రవృత్తిని నిబ్బరంగా దృఢ చిత్తం తో త్రోసి వేయగలిగిన వాడే విజయాన్ని సాధింప గలుగుతాడు. కానివానికి అన్నీ అడ్డంకులే.

విజయాలను సాధించిన వారందరూ 'వెంటనే చెయ్యి వాయిదా వెయ్యకు' అన్నవారే. ఆ పద్ధతి వారి కెంతో సహకరించింది కూడా. క్లెమెంట్ స్టోన్ అను ప్రోత్సాహక అమెరికన్ పౌరుడు "సకాలంలో సముచిత చర్యయే విజయానికి తాళం చెవి" అంటాడు. అదే ఉత్తమ ఫలితాలకు కీలకము. 'ఇప్పుడే చెయ్యి' అనేదే నా జీవిత సూత్రం. వాయిదా అనేది నా నిఘంటువు నుండి తీసివేసినాను. అదే నాకు గొప్ప ఊతాన్నిస్తుంది క్రమంగా ఈ అలవాటు నా జీవితంలో భాగమై కూర్చుంది. నేను వ్యాపారానికి దిగిన తొలి రోజుల్లో ఇదే నా తారక మంత్రం. ఒక పనికి సంబంధించి అన్ని విషయాలను ఆకళింపునకు తెచ్చుకొనటాని కెంతైనా కాలం తీసికోవచ్చు. ఆకళింపయిన తర్వాత, వెంటనే చేయుటమే నా అలవాటు. స్తబ్ధత పనికిమాలినది. మానవ సంబంధాలలో క్రియాపరతకున్న శక్తి మరి దేనికీ లేదు. అదే శరీరానికి జీవనాడి."



[ఇది మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో R. No. 763 సంఖ్యగల తాళపత్ర ప్రతినుండి గైకొనబడినది. ద్వితీయ ప్రపంచ సంగ్రామము జరుగువాళ్ళలో (1940-1945) అప్పటి సంయుక్త మదరాసు రాష్ట్ర ప్రభుత్వము జాతికి విలువైన యీ తాళ పత్ర ఖని 'బాంబు'ల కెఱయగునను భీతితో, 1943 ప్రాంతమున మద్రాసులోనున్న ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమును యావత్తూ సురక్షిత ప్రాంతమని యెంచి తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ భవనములందు చేర్చినది. సరిగా ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలములోనే మేము తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో విద్వత్పట్టమునకై చదువుచుంటిమి. అప్పుడు ఆ కళాశా లలో ఆంధ్రశాఖాధ్యక్షులుగా పూజ్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారుండేవారు. వారు సంస్కృతముతోపాటు దక్షిణభాషా సారస్వత సాగరములను పుడిసిలించిన అగస్త్యులు. చక్కని కవులు, విమర్శ విశా రదులు. అన్నింటికీ మించి యోగవిద్యా నిరూఢులు. వారు మమ్ము లను ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు పోవలసినదిగా, అపూర్వ తాళపత్ర గ్రంథములు పఠింపవలసినదిగా పదింబదిగా హెచ్చరించు చుండెడివారు వారి యుద్బోధము కారణముగా ఆ నాడెన్నింటినో అముద్రిత ప్రతులను పఠించుట జరిగినది. నేను ఈ 'రమాసౌందర్య మంజరి' ని ఆగస్టు 43లో ప్రతి వ్రాసికొని యుంచుకొంటిని. ఆనాడు చూచి వ్రాసికొన్న ప్రతులలో నిదియొకటి.

ఇది ఇరువదిమూడు పద్యములు గల లఘుకృతి. కృతికర్త 'రామయ్య' అని మాత్రమే కలదు. కవిని గూర్చి వివరము లేమియు తెలియరావు ఒకరు కదిపినగాని కదలని ప్రవృత్తి నాది. సౌజన్య ప్రపూర్ణులు **డా. బి. సూర్యనారాయణమూర్తిగారు** (పిఠాపురం) **"ధర్మసింధు"** పత్రికకు ప్రకాశకులుగా నుండుట హేతువుగా, ఇది 1978లో చీకటిని చీల్చుకొని వెలుగు చూచినది. రసవత్ కల్పనా చమత్కృతికల ఈ పద్యములు రసపు గుళికలు.]

# రమా సౌందర్య మంజరి

శ్రీమా అంగఁజెలంగు విశ్వమును
రాజీవంబు కెంగేల ను
ద్దామ ప్రౌఢిని దాల్చి, దోర్మయు
చతుస్తంభోల్లసద్విష్ణువ
క్షోమధ్యస్థల మంటపాంతరమునం
గొల్వొంది క్రీడించు, నిన్
పేమాయున్ మదిలోన నిల్పి
కొలుతున్ వేదాంతదీపాంకురా!

శ్రీకారాంచిత శుక్తి మౌక్తిక
మణి శ్రీకంఠ శుద్ధాంత కాం
తా శజాత కరాగ్ర కల్పిత
కనత్ పాత్రావళీ కించిదా
లోకాంకూర కుబేరదాశ్రిత తతీ
లోకైక సేవ్యాకృతీ!
పాకద్వేషికిరీటదీధితిపరి
భ్రాజత్ పదాంభోరుహా!

కమలము నీదు దివ్యపద
కాంతి భజింపఁగఁ గోరి వారి మ
ధ్యమున, వికర్తనాభిముఖియై,
కడలేని తపం బొనర్చి, యు
త్తమ పదవృత్తి నొందు టుచితంబు
సహాంసకమై సమంచిత
క్రిమ వృత చక్రసంగతిని
గాంచుట చిత్ర మిలాతలంబునన్

జలజము లబ్జజాదిసుర
సంఘము చేత సపర్య లందఁగాఁ
దలఁచి, తపం బొనర్చి, సము
దంచితరీతిని తావకాంఘ్రులై
నిలువఁగఁబోలు, కానియెడ
నిత్యవికాసము నాశ్రితాళి మం
జులతయు మించ నందియల
సొంపున కేసరముల్ ఘటించునే? 4

వరగతి మించ నంఘ్రులు
ప్రవాళములం దగ గెల్చి తద్విభా
స్వరరుచి యావకద్రవ
మిషంబునఁ గైకొనఁజూచి, విద్రుమో
త్కర మభిధాప్రభవంబునను
కంఠితటాంతము జేరె భ్రాంతి యె
వ్వరికిఁ దలంపఁగూడ దను
పల్కు నిజంబు గదా ధరాస్థలిన్. 5

పవిభృన్ముఖ్య దిగీశ పూజిత
పదాబ్జాలక్రి నక్షత్రముల్
సవిశేషస్థితి మీఱ విష్ణు
పద సంసక్తంబులై యుండియున్
దివసం బందుఁ బ్రదీప్తి లేమికిని
నాత్రిం బొంది తత్ప్రాప్తికై
భవదీయాంఘ్రుల నిల్వఁబోలు
నఖదంభం బొప్ప భవ్యాకృతిన్

చతురాస్యుండు భవత్తనూజుఁ
డగుటన్ సంప్రీతి తద్వాహనో
చిత హంసంబున కీవు మందగతి
వైచిత్ర్యాంశమున్ నేర్ప నా
తత వంశాగత సంప్రదాయ
కలనన్ దజ్జాతి కేనాటికిన్
గతిచాతుర్యముఁ బాయ దయ్యె
నిజశిక్షా కౌశలం బెట్టిదో!

వనరుహగేహా మందుఁ జెలువంబుగ
నాడెడు ముద్దుగుమ్మవో!
జనని! భవద్గురుండపుడు
శంభునికిన్ ఘనతూణవృత్తి గై
కొనుటఁ దలంచి జంఘికలు
కూర్మిని తద్గతి కాంచఁబోలుఁ గా
దన నవి కైటభప్రమథ
నాంబకహృద్యత నందనేటికిన్.

ఒనర కటిన్ శిరస్సుషమ,
నూరుల తుండవిభూతిఁ గైకొనన్
గని, తదవాప్తికై వినయ
కల్పనలన్ భవదంతికంబునన్
పనివడి ప్రత్యహంబు నెడఁ
బాయక కొల్చు నిభంబులట్లు, గా
దన ధరలో జలస్నపన
మారయ కుంజరవృత్తియే తగన్?

తేకువ మీఱ సర్వజగతీ
గణనీయత గాంచి వస్తుల
త్వా కలన ప్రభూత మహిమా
భినుతంబయి దిగ్ధరే మహా
నేక పమ స్తక స్థితి వహించిన
నీదు కటిస్థలంబు ర
త్నాకర మేఖలాంకము నుదంచిత
రీతి భజింపకుండునే!

ఘన లావణ్య రసంబు వెల్లి
విరియంగా నీదు నెమ్మెను శి
ల్ప నియామంబుగఁజేసి తద్రుచిర
తారుణ్య (ర్థ) సంసిద్ధికై
తన కెంగేల ఘటించి, పద్మ
భవ్యుఁడె తత్తంబోలు, కాకున్నచో
ననువౌ, కాటు మోష్టి
సంగ్రహణ యోగ్యప్రౌఢి పాటించునే!

బలితపుగుబ్బ చన్నుగవ
భారము నైపదు కౌనటంచు నే
ర్పలర విధాత కాంచన
మయాంచిత కంకణబద్ధ దీప్తమౌ
బలరిపు రత్నదండమును
బాగుగ నచ్చట పోటి నిల్పెనా
జలరుహగేహా! నీ వళులు
సన్నపునారును మీఱు నింపుగన్.

ఆరయ నీదు యౌవన
  వనాంతరమందు మనోజకుంభ వ
క్షోరుహ కుంభముల్ దనర
  సుందరనాభి సరః ప్రదేశమున్
జేరఁగ నేరకే కరము
  చెల్వలరంగను సాఁచె, గానిచో
సారసపాణి! నీ యెడల
  సామజ చిహ్నము గల్గ నేఁటికిన్. 1

సిరి యవలగ్నమున్ గగన
  సీమను - నాభి సుపర్వ దీర్ఘికాం
తరగతమైన హార సముదార
  మృణాళముపై వసించి సుం
దర రుచి మించు జక్కవ లనందగి
  చెన్నువహించు నీ పయో
ధర యుగళంబు వానికి
  నిదర్శనమయ్యె హరి ప్రియత్వమున్ 14

కమల! భవద్భుజా యుగము
  కల్పక వల్లుల కాదటన్న నె
ట్లమరును - పంచశాఖ నఖరాళి
  మిషంబున పల్లవ ప్రసూ
నము లవి గాన సేవక జనంబు
  లభీష్ట ఫలంబు లందుటల్
హిమకర సోదరీ వికచ
  హేమ సరోవి, లసత్కరాంబుజా! 1

జనయిత్రీ! భవదీయ సుస్వర
గళ స్పర్ధాళులై, యోషి నీ
రనిధం జేరి, తపం బొనర్చియు,
కఠోర ధ్యాన నిర్ముక్తి చే
యని, శంఖం బుదరంబు నాఁచెరఁగె,
భూమిన్ కీటసంజాత మొం
దును సర్వోన్నతి గాంచ నేర్చునె!
సుధాంభోరాజసంపత్కరీ! 16

జలజవిరోధి నీ వదన చంద్రుని
గోల్వఁగ లేఁత నవ్వుతో
కళ లవమాత్ర మిచ్చిన, ప్రకాశము
నొంది, త్వదాలయాధిపై
వెలయు, కృతఘ్నుఁడౌట పరి
వేష మిషంబున బద్ధుఁడయ్యె, దు
ర్బలుఁడు బలాఢ్యుతో నెదిరి
భంగము నొందక రిత్తఁబోవునే. 17

శ్రీలను మించు కర్ణములఁ
జెందిన కుండల రత్నదీప్తులన్
జాలి, నిశాకశీఁకముఖ
సారసవైరికి, వేడ్కమీఱఁ, ని
వ్వాళు లొసంగు పళ్ళెముల
వైఖరిఁదాల్చె, భవత్కపోలముల్
లోల విశాలలోచన! తలోదరి!
లోక శుభప్రదాయినీ! 18

కనుగవ కల్వలన్, మొగము
కంజములన్, రదపంక్తి మొల్లలన్,
నును పెదవుల్ చిగుళ్ళ, సుమనో
నిధి! నీవు బహూకరించుటన్
ననవిలుతుండు వాని గొని
నైపుణితో ననమాస్త్ర విశ్రుతిన్
గనె, నటుగాకయున్న, సుమ
కాండుఁడు మజ్జగముల్ జయించునే!

సీ॥ ఓషధీశు విరోధ మొందును పద్మంబు
రహి జగద్బంధు వైరంబు తొగకు
పిన్నతనంబున పికతుండహతిఁగాంచు
ప్రథిత చూతాశోక పల్లవములు
విరియు నంతనెవాడు వికచమల్లిక లస
తమశరోపద్రవ దశ దలంచి
యఖిలలోకైక భద్రాయతనంబులై
నిరవద్య వృత్తిని నెగడు కతన

తే॥ నబ్ధిసుత నీ ముఖాక్షి పూర్వాధరోష్ఠ
రదనముల కాత్మశరసామ్య మొదవు టెఱిఁగి
యచట రతి పంచశరులు బాణాసనముల
నిషంగాఁబోలు భ్రూలతా నిహ్నవమున.

సరసీజంబులు తావకాక్షులయి,
భాస్వల్లీల భాసించు వే
ళ, రయంబొప్పఁగ నర్థచంగుఁడు
ఫాలంబౌచుఁదా నిల్వ, న
త్తరి పద్మంబు, లరాతిపై కనకుచేతన్
బూను చాపంబు, లన్
గరిమన్ గైకొను నీదు కన్బొమల

ఫాలము నక్షులన్ గొలిచి బాల
శశాంకుఁడు పద్మపత్రముల్
శ్రీ లలరంగఁ బద్మయుతఁ జెందిన,
చంద్ర విరోధ మంబుకట్
పాళికి సత్యమంచు, విధి బావనఁ
జేసి, విధుంతుదగ్రహ
స్త్రీలను గావు నిల్పెనన్ జెప్ప
వహించెను నీదు భ్రూలతల్ 22

అమిత శ్రీగల నీ మొగంబు కమలం
బన్ భ్రాంతిచే, భృంగ సం
ఘము రాఁబూనఁగ, నాస గంధఫలి
శంకంజేయఁగా, పార్శ్వ భా
గములన్ మూగియు వెన్కఁజాలు
గొనెనాఁ, గన్పట్టె నీ ముంగురుల్ -
కమనీయంబగు దీర్ఘవేణియు
జగత్కల్యాణ సంధాయినీ! 33

అరవిందాలయా! సర్వలోకజననీ!
యాదోధి రాట్పుత్రి! సుం
దర దివ్యాంబర కంచులీ కనక
రత్నప్రోత భూషాసము
త్కర సంశోభిని! విస్వతా పరిణత
ధ్వాంతచ్ఛిదా కౌముదీ!
హరి బాహాపరిరంభ గుంభన

కల్యాంబోప్ప, పఠించువారఁ పక్షుల
సత్కామ్యార్థముల్ గాంచి, మాం
గల్యాగార సుపుత్ర పౌత్రసతి
సంతోషం బొప్ప వర్ధిల్లి, కై
వల్యంబున్ దుదనొందు, నీదు
కరుణన్ వైకుంఠలోకేశ్వరీ! 25

హరి దివ్యాంఘ్రి సరోజ బంధురిత
హృద్యావ్యాపారుఁడన్ - పండితా
దరణీయుండను 'రామయా' హ్వయుఁడ
నుద్యద్భక్తి సౌందర్యమం
జరి నర్పించెద నీకు, సత్కరుణ
మించన్ వేడ్కఁగైకొమ్మ, సా
గర రాజన్యకుమారికామణీ!
కనత్కాంచీరణత్ కింకిణీ! 26

సమాప్తం.

